# గ్రోమోర్ కాంప్లెక్స్ ఎరువులు భూమిలో పోషక పదార్థములను చేర్చటం మాత్రమే కాదు, వివిధ పైరులకు కావలసిన సంపూర్ణ పోషణ నిస్తాయి. అదే గ్రోమోర్ కాంప్లెక్స్ ఎరువుల ప్రత్యేకత!





**చాలా రకాల ఎరువులు వాడితే**

నత్రజని మురుగు నీటి ద్వారాను,
వాయు రూపంలోను వృథా అయిపోతుంది
రసాయనిక మార్పుచెంది
లంగా అందదు



**గ్రోమోర్ వాడి తేడా చూడండి**

అమోనియా రూపంలో అందే నత్రజని
భూమిలో నిలిచి పైరు పెరిగినంత కాలం
వృథా చెందక లభిస్తుంది. భాస్వరామ్లం నీటిలో
కరిగి పైరుకు చాలా అనుకూలంగా అందుతుంది

కాంప్లెక్స్ ఎరువులు మీ డబ్బుకు
న విలువను అందజేస్తాయి!

చేనుకు చేవ,
రైతుకు రొఖ్ఖం —
గ్రోమోర్

coromandel
gromor

GROMOR
28-28-0

కోరమాండల్
ఫెర్టిలైజర్స్
లిమిటెడ్

మీకు కావలసిన గ్రోమోర్ ఎరువులు మీకు
దగ్గరలోనున్న ఫ్యాక్టరీ వారి ఎరువుల
డిస్ట్రిబ్యూటర్ల వద్ద కొనండి

AIYARS-CF 370-TL

# ఉత్తరాలు

## వ్యాసాలు

రాచకొండ శ్రీధర్‌గారు రాసిన ఉత్తరం 30—6—72న చదివాను. వారు వెలిబుచ్చిన సందేహాలు నివృత్తి చెయ్యడం కోసం యీ సమాధానం రాస్తున్నాను.

(1) నేను రైతుని. భూస్వామినికాదు. నాపొలంలో నేను కష్టపడి పని చేస్తాను. (2) నేను సోషలిస్టుని ప్రజలందరికీ సమాన అవకాశాలు ఉండాలనికోరేవాడిని (3) పరిమితి ఉండాలి అని ఏకీభవించేవాడిని. (4) వ్యవసాయాన్ని గురించి క్షుణ్ణంగా తెలిసినవాడిని స్వంతంగా వ్యవసాయం చెయ్యడమేకాదు. మన దేశంలోనే కాకుండా ఇతర దేశాలలో వ్యవసాయ పద్ధతులని ప్రత్యక్షంగా చూడటమేకాదు ప్రత్యేకంగా వ్యవసాయం గురించి అధ్యయనం చేసినవాడిని. (5) రైతుకు ప్రస్తుతమున్న దుస్థితి తొలగి జనం కూడా సుఖపడాలని కోరేవాడిని (6) 1500 నెలకు ఆదాయం వుంటేకాని వ్యవసాయంమీద ఆధారపడి జీవించే కుటుంబం ప్రగతిని సాధించలేదు అని తెలుసుకున్న వాడిని. (7) ఈచట్టాన్ని వ్యతిరేకించేవాడినికాదు, కావాలనేవాడిని అందుకు నేను కూడా మన ప్రధానమంత్రిని ముఖ్యమంత్రిని అభినందిస్తున్నాను.

నేను కోరేదల్లా రెండేవిషయాలు— దేశంలో ఆహారం సమృద్ధిగా పండాలి. అది పండించేరైతు సుఖంగా వుండాలి దానికోసరం ఎవరు కృషిచేసినా చేయూతనివ్వటానికి సిద్ధంగా వున్న మొదటిరైతుని నేను.

—మల్లాది సూరిబాబు (మచిలీపట్నం)

* * *

30—6—1972 సంచికలోని రాచకొండ శ్రీధర్ గారి వ్యాసం చదివాను. వారు పేర్కొన్న వందలాది ఎకరాలుగల భూస్వాములు నేడు ఎంతో మంది లేరు. మహా ఉంటే తాలూకాకు ఒకరు ఉంటారేమో. వారు వ్రాసినట్లు భూస్వాములంతా దుర్వ్యసనాలు చేయరు. వారు సినిమాలలోచూసి అలాంటి అభిప్రాయం ఏర్పరచుకొని ఉంటారు.

100 ఎకరాలలోపు భూమిగల వారందరూతమ పొలాల్లో పని తామే చూచుకుంటూ ఉంటారు. వారు స్వయంగా పొలం దున్నక పోవచ్చు. ఎందుచేతనంటే ఆయనే ఆపొలం దున్నలేడు. పైగా అట్లా దున్నితే యింకొక జీవానికి కూలి దొరకదు 50 ఎకరాలలోపు భూమిగలవారు వారి పొలాలు వారే దున్నుకుంటున్నారు.

10 ఎకరాల భూగరిష్ఠ పరిమితి విధించారనుకోండి. ఇప్పుడు 10 లేక 7,8 ఎకరాలు గలవారు బాగా పండించి, తద్వారా వచ్చిన డబ్బుతో పొలం కొనుక్కోడానికి వీలు పడదు. అప్పుడు అతడా డబ్బును విలాసాలకు దుర్వినియోగ పరుస్తాడు. ప్రతిరైతు తన డబ్బును భూమిరూపంలోఉంచుకోవాలని చూస్తాడు. అలా వీలు పడనప్పుడు అతనికి అధికాహారోత్పత్తి చేయాలనే బుద్ధిపుట్టదు చేసినా అతనికి ఉపయోగం లేదు గనుక. ఇప్పుడు 20, 30 ఎకరాలుగల రైతులు 20 సంవత్సరాల క్రితం 10 ఎకరాలలోపు భూమి గలవారే. వారు కష్టపడి పనిచేసి మిగతా పొలాన్ని కూడా కొనుకున్నారు. అట్లాంటి పొలాన్ని పరులకు యిచ్చేయమంటే వారికి ఎంత కష్టంగా ఉంటుందో ఆలోచించండి.

ఒకరి యింట్లో ఒకవస్తువు నిరుపయోగంగా పడి ఉందనుకోండి. ఎవరన్నా ముక్కూ, ముఖం తెలియనివాడు వచ్చి, ఏమండీ, ఆవస్తువును నాకిస్తారా కొన్నాళ్ళు వాడుకొని తిరిగిస్తాను! అని అడిగితే ఎంతవరకు యిస్తారో చెప్పండి. అట్లాంటిది తన భూమిని, తాను సాగుచేసుకుంటున్న భూమిని తాను చెమటోడ్చి సంపాదించిన భూమిని, ఊరికే, ఎప్పటికీ, ఏవిధమైన కాంపెన్‌సేషన్ లేకుండ పరులకు యిచ్చెయ్యమంటే అది మానవత్వమనిపించుకోదు.

ఇప్పటికైనా మనం గుడ్డిగా పథకాల్ని సమర్థించడం మానాలి. ఎవరంతటవారుస్వయంగా ఆలోచించాలి. ఇలాంటి సంస్కరణలతో శ్రామిక వర్గాన్ని, యిప్పటివరకు హాయిగా బ్రతుకుతున్న వారిని అనవసరంగా దెబ్బగొట్టడమే అవుతుంది.

—హరిబండి గాంధి, (తనగపాడు)

## సీరియల్

నాలుగుమంచాలు సీరియల్ పోయినవారం వరకు చాలా బాగుంది. తరువాత ఏమవుతుందో అనే ఉత్సుకతతోనే చదివాను. కాని ముగింపు మాత్రం ఎందుకో నచ్చలేదు సూర్యంకు దూరంగా విశాల వెళ్ళిపోయిందంటే, చాలా బాధఅనిపించింది. కనీసం మిగిలిన జీవితంలోనైనా వాళ్ళిద్దరు కలిసి సుఖంగా జీవించే ముగింపు ఉంటే బాగుండునని పించింది.

నిర్మొగమాటంగా వ్రాసినందుకు క్షంతవ్యుడిని

——భార్గవరాం (భువనగిరి)

* * *

నాలుగుమంచాలు సీరియల్ ముగింపు విచిత్రంగా వుంది. సుఖాంతంగా చేసివుంటే మరింత బాగుండేది సహజంగా కూడవుండేది. (తిరిగివచ్చిన సూర్యం విశాలను కలిపివుంటే) విషాదాంతంచేయడం వలన సూర్యం, విశాల పాత్రల మాట ఎలావున్నా, రామం పాత్రకుమాత్రం రచయిత అన్యాయం చేశారేమో అనిపిస్తుంది. ఇలా ముగించడం వలన రామంని ఒకాకిగా మిగల్చడం మాత్రమే కాక, సూర్యం కేల్తే గారికిచ్చిన మాటను ఒప్పి వాడుగా మిగిల్చారు. మిగిలిన భాగాన్నంత ఉత్సాంత నాతుర్యంతో జీవన పూరితమైన స్థాయిలో నడిపించిన రచయిత రామంపాత్ర విషయంలో పొరపడ్డారని అనక తప్పదు.

సూర్యానికి జ్ఞానోదయమయిన ఘట్టం బుద్ధ చరిత్రములోని బుద్ధునికి జ్ఞానోదయమయిన ఘట్టాన్ని స్ఫురింప చేసింది.

మిగిలిన కాలమంతా తన వంశ ప్రతిష్ఠ, కుటుంబ క్షేమం కోసం విశాలను వివాహం చేసికోవడానికి సాహసించలేని సూర్యం, చివరి క్షణంలో విశాలను వెతుకుంటూ వెళ్ళి... ప్రవృత్తికి చిహ్నంగా వుంది.

మొత్తంమీద ఈ సీరియల్ నవల చాల బాగుంది. దీని ద్వార ధర్మమర్మాలను కొన్నింటిని పాఠక లోకానికి అందించిన రచయిత ఒలివాడ కాంతారావుగారికి నాహృదయ పూర్వక ధన్యవాదాలు.

—...రాజేశ్వరరావు (అమలాపురం)

*

'నాలుగుమంచాలు' సీరియల్ ఏమి బాగులేదు. మొదటినుండి గొడవగానే ఉన్నది. చివరికైనా కథ సుఖాంతము అవుతుందని నేను ఆశించేను. కాని

ముగింపు కూడా ఏమీ అంత బాగులేదు. 'రాగధార' సీరియల్ చాలా బాగున్నది. ఇంత చక్కని నవలని అందిస్తున్న విమలారామంగారికి నా కృతజ్ఞతలు.

నాకుకూడ జాతకం అంటే నమ్మకాలులేవు. ఈ వారం మీరు ప్రచురించిన 'జాతకం' కథ బాగున్నది. నేను ఇంతవరకు జాతకంమీదకథ చదువలేదు. ఈ రోజుల్లో ఎన్నివివాహాలు జాతకాలు చదక నిఫలమవుతున్నాయో అన్నవిషయం నాకు తెలుసు.

—లక్ష్మీజీ, (హైదరాబాదు)

## కథలు

'ప్రతిపిధి' కథ చాలా బాగుంది. రచయిత్రి 'లాధిక'గారికి కృతజ్ఞత చెప్పడానికి తెలుగులో పదములు దొరకవు.

—బసవ వైకుంఠరావు, (గోపాల్ పూర్.ఆన్. పీ)

* * *

'నేను మామూలు మనిషిని' పెద్దకథ ముగింపు చాలా నచ్చింది. అదే సరళని, మోహన్ని కలిపి ఉంటే నచ్చేది కాదేమో?

—సి. మీనాకుమారి, (కాకినాడ)

* * *

'రిట్రెంచ్‌మెంట్' నేటి పరిస్థితులలో ఉద్యోగానికి అప్లయిచేసిన వాండ్లలో అమ్మాయిలు వున్నారంటే మిగతా మగవాండ్లు నిరుత్సాహం చెందక తప్పదు. ఒక రోజు వాండ్ల సంఖ్య అరుదుగా ఉన్నప్పుడు అంతా ఆడవాండ్లు కాయం.

—వి. సిద్దానందం, (సిరి పూర్—కాగజ్ నగర్)

## ముఖచిత్రం

30—6—72 ముఖచిత్రం నేనేకా నా

## ఉత్తరాలు

మిత్రులుకూడాచూచి చాలా ఆనందించారు. ముఖచిత్రాలుచూచి పాఠకులేగాక యితరులుకూడా కొనేటట్లుగా వేస్తున్నందుకు సంతోషము. 'రాగధార' సీరియల్ చాలా బావుంది. మధు రాధలో తన జీవితగాథను చెబుతుంటే చివరకు ఏమి జరుగుతుందని ఆతృతగా యున్నట్లుగా విమలారావుగారు వ్రాసారు. చాలా బావుంది.

—నెల్లిపర్తి చందర్‌రావు, (నావికానగర్)

## సినిమా

30—6—72 పత్రికలో గుంటూరు నుంచి సోదరీమణులు కృష్ణపై వెలిబుచ్చిన అభిప్రాయం సమంజసమయినది కాదని మా అభిప్రాయం. చలనచిత్ర పరిశ్రమకు కృష్ణ వెన్నెముక వంటివాడు అంటే మాకు చాలా బాధ కల్గినది అని వ్రాసారు. బాధ ఎందుకు? తెలుగు చలనచిత్ర పరిశ్రమలో ఎందరో అతిరథ మహారథులువున్నారు. కాని వారిలో ఏఒక్కరు విదేశాలలో షూటింగు జరపలేక పోయారు. ఒక ఉన్నతాదర్శంగల యువనటుడు అధిక సాహసంతో అందరునిందించిన అధికవ్యయప్రయాసలతో విదేశాలలో షూటింగు జరపటం గొప్ప కాదా? ఒక నటుడిపై అభిమానం వుండవచ్చునుగాని కొంతమందికి అభిమానం గల నటుడు పై దురభిప్రాయం వెలిబుచ్చటం మంచిదికాదని మా మనవి.

—పాండు, కృష్ణ, (కోరుకొల్లు)





# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 28—7—72
శ్రీవిరోధినామ సం॥ ఆషాఢమాస॥ బ॥ విదియ

సంపుటము : 65 సంచిక : 49

స్థాపితము:
1908

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1

విడిప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక



బియ్యం
ధరల పెరుగుదల
సామాన్యుడికి అందని ఎత్తులో
ప్రజలు
చైనా
సహాయం
శ్రీలంక
ప్రమాదంలో ఉన్న అల్ప సంఖ్యాకుల హక్కులు!
ఉద్యోగాలని వేలంవేసే హక్కు మాకుంది
ఉపాధ్యాయుల జీతాలు ఇవ్వక పోవడం మా హక్కు
ఫీజులు ఎక్కువ వసూలు చేసే హక్కు మాది
ఏం చెయ్యను! వాళ్లు నా పేరు చెడగొట్టారు
భుట్టో
సింధుల్లో అల్లర్లు

# "నేను ఎలా బతికి బయటపడ్డాను"

—— జూలియాన్ కోయెప్కె ——

## 4

మరియా పాచీటియానది, పొద్దువవుప్ప టవురక్ విస్టా అని వో చిన్న గ్రామానికి వెళ్ళి చేర్పాలని ఆ ముగ్గురూ తీర్మానించారు. ఆ వూరిలోనే చిన్న విమానం దిగడానికి కొన్ని అనువైనచోటు. వుక ల్మాతో మాట్లాడడానికి వీలైన రేడియోకి సంబంధించిన వ్యవహారాలూ వున్నాయట.

కాని షిబోన్యానదికి నేమీ వచ్చినట్లు లేదు ప్రవాహం రాన్రానూ పెరిగి పోసాగింది దాని వుధృతం చాలా భయంకరంగా వుంది పడవను నీటిలోకి నెట్టే ముందు పోవాల్సినమార్గం కేసి చూశాను గుండె గుభేలుమంది కారడవి మధ్య ప్రవహించే యీనదిలో పడవేసుకు ప్రయాణం చేయడం అసాధ్యమైన కష్టమనిపించింది

అలా అనుకని ప్రయాణమేమీ ఆపలేదు. కొన్నిచోట్ల చెట్లకొమ్మలు నీటిమట్టం మీదికి వంగిపోవడంవల్ల ఆ కొమ్మల్లో చిక్కుకుపోతామేమో ననిపించింది అయినా వారు ముగ్గురూ చాలా జాగ్రత్తగా అవన్నీ ఛేదించుకుంటూ పడవను, ప్రయాణాన్ని ముందుకు నెట్టుకుపోతూ వున్నారు

షిబోన్యానది వెళ్ళి పాచీటియానదిలో చేరేచోట భయంకరమైన సుడిగుండాలు తిరుగుతున్నాయి దీనికితోడు నదిలో వలే కలపదుంగల గొడవొకటి.

అయినా రోజంతా ప్రయాణం చేసి, అనుకున్నది సాధించాము పడవ వో చిన్న ప్రదేశానికొచ్చింది పొడినేల వున్నచైపుకు చాలా జాగ్రత్తగా మళ్ళించారు వుడక పెట్టిన అరటిపళ్ళూ, అవేవో ఆకులతో కాచిన టీ ,యివి రెండూ మా కక్కడి వాళ్ళు యిచ్చారు నన్ను చూస్తే వారికి రారెత్తుండాలి

నే తొడుక్కున్న బుల్లిగౌను పీలికలై, సర్వనాశనమైపోతే వాళ్ళు నాకో ప్యాంటూ, వో చొక్కా యిచ్చారు ప్రతి పాకలోంచి లోపలున్నవాళ్ళంతా బిలబిలామని బయటికి వచ్చి తిన్నగా నరకంనుంచి వూడిపడిన దానిని చూసినట్లు నన్ను చూడసాగరు.

దాంతో అసలు నా రూపం ఎలా వుందో తెలుసుకోవాలనిపించింది నాకు.

ఆ వూళ్ళో కాస్సేపు విశ్రాంతి తీసుకున్నాక, మేం మళ్ళా ప్రయాణం కట్టాము. ఆ పడవలోపల క్రింద పడుకుంటే చుర్రున కాలె సూర్యుణ్ణుంచి తప్పించుకోడానికి ఏమీ లేకపోయింది నా బాధ గ్రహించి వో తెల్లని బొంతలటి దిచ్చారు నళ్ళు అదికప్పుకుంటే వుహూ చమటలు పోయనారంభించాయి. ఆ ఎండ కన్నా యిదే నయమని వూరుకున్నాను

మధ్యాహ్నానికల్లా టవురన్ విస్టా చేరాము అక్కడ కూడా కేరింతలు కొడుతూ మా దగ్గరకొచ్చిన జనం నన్ను చూసి, కొయ్య

క్షేమంగా కోలుకుంటున్న జూలియాన్‌కి సహాయపడుతున్న ఆమె తండ్రి

జారి పోయారు. ఒహోయన మాత్రం తెగించి నాతో మాట్లాడాడు. నన్ను చూసి వారలా కొయ్యబారిపోడనికి కారణం లేక పోలేదనిపించింది నాకు.

నా కళ్ళు బాగా వుబ్బి, రక్తపు ముద్దల్లా వున్నాయట. కళ్ళేగాక, ముఖమంతా కూడా బాగా వుబ్బి వుందట. చేతులూ కాళ్ళూ బాగా వాచిపోయాయి. ఈగల దోమల గుడ్లతో, రసితో చేతులు చాలా అసహ్యంగా వున్నాయి. నా ఆకారం కల్లో దెయ్యంలా వుండుండవచ్చు.

ఆ పడవలోంచి నన్ను వో చిన్న పాకలోకి తీసుకువెళ్ళారు. ఆ చిన్న పాక ఆ వూరికి ఆసుపత్రి వంటిదట. వాళ్ళు నన్నందులోకి తీసుకువెళ్తుండగా భయంతో నా శరీరం బిగిసిపోయింది. నాకు అన్నీ బాధాకరాలే అన్నీ నిరుత్సాహాలే. చివరికి నా ఊపిరి పీల్చుకోడమే కష్టమయ్యింది అక్కడ నన్నో మంచంమీద పడుకోబెట్టేసరికి కాస్త హాయనిపించింది.

నా గాయాలన్నింటినీ శుభ్రంగా కడిగేసి, చక్కగా కట్లు కట్టారు. ఈగలు, దోమల గుడ్లు చావడానికి అదేదో మందు కాళ్ళకీ, చేతులకూ పట్టించారు. వో ఇంజక్షనిచ్చారు బాధతో గిల గిల్లాడడానికి వీలు లేకుండా, కాళ్ళూ చేతులను మంచానికి సున్నితంగా గట్టిగా కట్టేశారు. ఈ విషయం నే గ్రహించనేలేదు.

నేను ఆ ప్రమాదంలో దివినుంచి భువికి పడి పదకొండున్నర రోజులకు మళ్ళీ మొదటసారిగా విమానాన్ని చూసినట్లయ్యింది నన్ను రక్షించడానికది పుకల్పానుంచి వచ్చిందట.

నన్ను వాళ్ళా విమానంలో ఎక్కించాక, ఆ విమానం నడిపేది ఒక స్త్రీ అని తెలిసింది. ఆమె పేరు జర్సీకాడ్‌ట. ఆవిడ విధాన్ని శాంతస్వభావాన్ని చూస్తే నాకు హాయనిపించింది. గతంలోపడ్డ కష్టాలన్నీ మరచిపోయాను. ఆవిడ జుట్టు రాగి రంగులో వుంది. ఆమెకు 40 ఏళ్ళట. మియామీకి చెందినదటామె. యునైటెడ్ స్టేట్స్‌లో వ్యోమయానుల శిక్షణ పూర్తి చేసి కన్నా—లలో ఆమె తొలి మహిళట వ్యాపార విమానాలూ, కూలిపోయిన మా విమానంవంటి ఎలక్ట్రా విమానాలూ ఆవిడిదివరకే చాలా నడిపిందట.



జూలియాన్ తీసుకు వెళ్ళడానికి పుకాల్పానుంచి వచ్చిన విమానం.

యారీనాకోచా అనే సరస్సువద్ద నున్న వో యింటికి నన్ను తీసుకువెళ్ళారు. ఆ సరస్సును 'నింగిని చూసే తాటిచెట్ల సరస్సు'న్ని ఇండియన్స్ అంటారు. పుకల్పాకు యిదేమంత దూరంలో వున్నది కాదు. అమెరికన్ శాస్త్ర వైద్యుడు డాక్టర్ ఫ్రాంక్ హోర్సిన్ నాకు వైద్యం ఆరంభించారు. మా నాన్నగారూ నా పక్కనే వున్నారు.

నా భయంకర యానాన్ని ఆకాశవాణి తన యిష్టవచ్చినరీతిలో వర్ణించి ప్రచారం చేస్తూంది. నాకు దుఃఖం ఆగలేదు

మా విమానం కూలిపోయినచోట వెతకడానికి బోల్డు మంది జట్లు జట్లుగా బయల్దేరారట. ఇంకా అన్ని శవాలూ దొరకలేదట. అసలు విమానం దేన్నైనా ఢీకొందా, లేక గాలిలో తనంతట తానే మండిపోయిందా అన్నది వారికి సమస్య అయింది.

ఈ ప్రమాదాన్ని గురించి పుకల్పాలో వివరిస్తునవచ్చినట్లు వారు చెప్పుకుంటున్నారు. ప్రమాదంలో నా లాగే కొందరు



[illegible] జూలియాన్.

బ్రతికి బయటపడినా, సరియైన సమయంలో సహాయం లభించక చనిపోయారా!

ఈ ప్రమాదంలో బ్రతికిన ఒకాయన తన కోటును తల క్రింద పెట్టుకుని, ఓ చెట్టు క్రింద పడుకునుండగా చూసినట్లు ఓ జట్టు (వేటకడానికి బయల్దేరినజట్టు) అంటోంది. ఇదేగనుక నిజమైతే యింకా బ్రతికినవారుండచ్చు కదా!

విమాన ప్రమాదం జరిగినచోటునుంచి సుమారు ఏడు మైళ్ళ అవతల ఒకచోట ధ్వంసమైపోయిన విమాన భాగాలూ, చింపిరి, కాలిన బట్టలూ, నాశనమైపోయిన సామగ్రీ కనుపించిందనీ, అక్కడి చెట్ల మీద కూడా యిలాటివి దొరికాయనీ మరి కొందరంటున్నారు.

ఇది నిజమైతే విమానం ఆకాశంలోనే పేలిపోయుండాలి కదా! అలాటప్పుడు కనీసం ఒక్కరు కూడా బ్రతకడానికి అవకాశమే లేదే!

ఎవరెలాపోతే నాకేం గాని, మా అమ్మ మాత్రం యిక నాకు లేదు, ఆ విమానం మా అమ్మను మింగేసింది. తన పొట్టను పెట్టుకుంది. ఆమె నన్నెంతో గారాబంగా చూసుకునేది. పక్షుల శాస్త్రంలో ఆమె చక్కని పేరు గడించింది. ప్రపంచమంతటా ఆమె డాక్టర్ మారియా కోప్కెగా పేరు పొందింది. గతంలో ఆమె ఓ రెండు కొత్తరకమైన పక్షులను కనిపెట్టింది. లిమా నాచురల్ హిస్టరీ మ్యూజియంలో పక్షుల, స్తన్య జంతువులశాఖకు ఆమె అధికారిణి. ఆ మ్యూజియం సెయింట్ మార్కొస్ విశ్వవిద్యాలయానికి చెందినది. ఆ విశ్వవిద్యాలయంలో మా నాన్నగారు జువాలజి, హైడ్రో బయోలజి విభాగాలకు ప్రొఫెసరు.

వాళ్ళిద్దరూ సామాన్యంగా తీరిగ్గా యింట్లో కూచునేవారు కానేకాదు. చేరువలో వున్న పుస్తకాలతోనూ, మ్యూజియముల తోనూ సంతృప్తిపడేవారు కాదు. పుకల్పా అరణ్యాల్లో పక్షులు, జంతువులు—వీటిని గురించి చదువుతూ చాలా కాలం గడిపారు. ఈ చదువు వారికి చాలా విజ్ఞానాన్నిచ్చిందనేవాళ్ళు.

# నేను ఎలా బతికి...

ఆ రోజుల్లోనే నేను అరణ్యం గురించి చాలా తెలుసుకున్నాను. 1967—69 రెండేళ్ళలోనూ వాళ్ళతో నేనూ అరణ్యంలో వున్నాను. అరణ్యంలో వుండే క్రిమి కీటకాదులెంత భయంకరమైనవో, అవి మనుష్యుల నెవిధంగా హింసించి, నాశనం చేస్తాయో గూడా తెలుసుకున్నాను. ఆ క్రిములు పుస్తకాలు తినెయ్యకుండా పుస్తకాలనిండా ఎప్పుడూ మందు జల్లడమే గాక, ప్లాస్టిక్ సంచిల్లో పుస్తకాలను దాస్తూ వుండేవాళ్ళం.

ఓ మార్గదర్శినీ, అగ్గిపెట్టెలూ, దోమతెర, మంచి పదునైన కత్తి, వుప్పు మాత్రలూ—యివి చేతిలో లేందే అడవుల్లో కసలు అడుగుపెట్టడం చాలా ప్రమాదమన్న విషయం నేనప్పుడే తెలుసుకున్నాను. ఏదెలా వున్నా, వుప్పు మాత్రలు మాత్రం చాలా ముఖ్యం. అడవులో కాసే ఎండలకు వుప్పుమాత్రలు లేకపోతే శరీరం నిలువునా ఎండిపోతుందంటే అతిశయోక్తి లేనేలేదు.

అడవుల్లో తిరుగుతున్నపుడు ఎట్టి పరిస్థితుల్లోనూ నది వొడ్డును వొదలకూడదు. నది వొంపులు తిరిగితే, దాని వొడ్డున నడిచేదేవిటి? దగ్గర దారిలో వెళ్ళి మళ్ళీ నది చేరుకుందామని నది వొదిలి అడవిలోకి వెళ్తే యిహ మృత్యుముఖంలో తలపెట్టినట్టే.

గత్యంతరం లేనపుడు కప్పలను, పాము ఫలహారం చేయవచ్చు. పాము పడగను మాత్రం తినకూడదు. పడగలో విషం వుంటుం దెప్పుడూ. ఆ సంగతి మర్చిపోకూడదు.

ఒకే ఒక్కమాటలో చెప్పాలంటే నేను అడవిని గౌరవించడం నేర్చుకున్నాను. ఒక్కొక్కప్పుడు చేతిలో ఏ సామగ్రీ లేనివాడు కూడా దైవికంగా బ్రతికి బయటపడుతూంటాడు. ఓ అమెరికన్ యువకుడు చేతిలో ఏ సామాగ్రీ, సాధనా లేకుండానే బ్రతికి బయటపడ్డాడు. అతన్ని తల్చుకుంటూనే ఆ కష్ట సమయంలో నాకు నేను ధైర్యాన్ని తెచ్చుకున్నాను.

అరణ్యంలో మకాంవేసి, ప్రయోగాలు చేసే ఓ జట్టుకు చెందినవాడా కుర్రాడు. ఆ జట్టు నాయకుడికి ప్రమాదవశాత్తూ కాలిలో తుపాకీ గుండు తగిలిందట. ఈ కుర్రాడే అతనికి సహాయమయ్యాడట.

అతనివద్ద మార్గదర్శిని లేదు. కత్తీ లేదు. చివరికి తినడానిక్కూడా ఏమీ లేదు. ఇవేమీ లేకుండానే అతనా అడవిలో వంటరిగా బయల్దేరాడు. అనక తను తిరిగెళ్ళే దారిగాని, ముందుకెళ్ళే దారిగానీ కనిపెట్టలేకపోయాడు. దాంతో అసలతనా అడవికి నైవేద్యమయిపోయుండేవాడే కాని, ఓ చిన్న ప్రవాహాన్ని పట్టుకుని ఓ నది చేరాడు. ఆనది మేం మకాంచేసిన ప్రాంతం దగ్గర్నించి ప్రవహిస్తుంది. దానివల్ల అతను మమ్మల్ని చూసి ఎలుగెత్తి అరిచాడు. మేమతన్ని కాపాడాము.

నా కష్ట సమయంలో నేనీ కుర్రాడినే మనస్సులో పెట్టుకున్నాను. ఆ సమయంలో పాపం అతని బుర్రలో ఎంత భయంకరమైన ఆలోచనలు వచ్చుంటాయో కదా అని నేనూ మా అమ్మా అనుకుంటూవుండేవాళ్ళం. తీరా నాకూ అదే అవస్థ వచ్చినపుడు 'ఆ కుర్రాడే చేయగలిగినవాడు నేను చేయలేనా ఏంటి?' అని నాకు నేనే ధైర్యం చెప్పుకున్నాను.

అతని నామస్మరణే నన్ను బ్రతికించిందేమో!

ఆ పదకొండు రోజులలో నేపడిన నానా పాట్లూ తల్చుకుంటే యిప్పటికి నాకు వెన్నులోంచి వొణుకు పుట్టుకొస్తుంది. మా అమ్మను తల్చుకున్నా నాకంత బాధ కలుగుతుంది.

కానీ, నే బతకాల్సిన కాలమింకా బోల్డుంది.

నా తలిదండ్రులలా నేనుకూడా జంతుశాస్త్రమే చదవాలి, నా తండ్రితో అరణ్యంలోని పరిశోధనా కేంద్రంలో వుండాలి. లిమాలో స్కూలు చదువు పూర్తిచేసి, జువాలజి జర్మనీలో చదవాలి.

అవును.

జీవితంలో జర్మనీ జంతుశాలలో పని చేయాలన్నది నా కోర్కె.

(అయిపోయింది) ●




✱ రాఘవులొకసారి కుంపట్లో బొగ్గుల్ని కుళ్ళగించి, సట్కారుతో రెండు క్రొత్త బొగ్గుల్ని తీసి కుంపట్లో వేశాడు. బల్లపై పెట్టిన పాలగిన్నెను తిరిగి కుంపటిపైకి ఎక్కించాడు. ప్రక్కనున్న పాతగుడ్డతో చేతుల్నొకసారి తుడుచుకుని రోడ్డుమీదకొచ్చి ఆకాశంలోకి చూశాడు.

ఆకాశమంతా నల్లగా మబ్బుపట్టి వుంది. ఉండుండి ఒక చలిగాలి తెమ్మెర అతని టీ దుకాణంమీదిగా వీరమ్మ దుకాణంవేపు వెళ్తోంది.

రాఘవులు వీరమ్మ దుకాణంవేపు చూడకూడదనుకుంటూనే చూశాడు. వీరమ్మది కూడా టీ దుకాణమే. అయితే వీరమ్మ అతనిలా ఖాళీగా లేదిప్పుడు. నిట్టాడి పాకలో అటూ, ఇటూ వేసిన కొయ్య బెంచీలపై కూర్చున్న 'కస్టమర్స్'కి టీ కలిపివ్వటంలోనో, వాళ్ళనుంచి డబ్బులు తీసుకోడంలోనో, పెద్ద డబ్బాలోని పంచదారను బల్లపైనుండే చిన్న గిన్నెలోకి మార్చుకోడంలోనో 'బిజీ'గా వున్నట్టు కనిపిస్తోంది. 'కనిపించడమేమిటి, బిజీగానే వుంది' అనుకున్నాడు రాఘవులు. తను వీరమ్మ దుకాణంవేపు చూడటం వీరమ్మ ఎక్కడ చూస్తుందోనన్న భయంతో మూపుల్ని మరల్చుకుని 'వర్షమొచ్చేట్టుందే' అనుకుంటున్నట్టు పెద్దగానే అనేసి లోపలికొచ్చాడు.

లోపలికొచ్చాడన్నమాటే గాని ఏంచేయడానికీ తోచలేదతనికి.

ఇంతలో రంగడక్కడకొచ్చాడు. చింపిరి తల, జారిపోతున్న నిక్కరు, నల్లగా నిగనిగలాడే చొక్కాలేని శరీరం, ఇదీ వాడిరూపం. ఎంగిలి టీ గ్లాసుల్ని కడగడం, పరోటా తిన్న ఆకుల్ని చెత్త కుప్పపైకి చేరవేయడం—ఇవీ వాడిపని ఆ టీ దుకాణంలో.

'నాకో పావలా గావాలి' తలగోక్కుంటూ అడిగాడు వాడు.

రాఘవులు గతుక్కుమన్నాడు. రంగడు తన కివ్వవలసిన పావలానే అడిగినా రాఘవు

లికిమాత్రం చిరాకు ముంచుకొచ్చింది.

'పావలాలు ఎక్కడ్నుంచి తెమ్మంటావురా! పొద్దుట్నుంచీ ఎన్నివందల యాపారం సేశాననుకుంటున్నావేం? సరుకంతా పూరికే పోతోందే అని నేన్నస్తుంటే...పావలా గావాలంట, పావలా...'

రాఘవులు మాటాడటం ఆపి చూసేవరికి రంగడక్కడలేడు. దొడ్డివాకిలిగుండా కాలువపైకి వెళ్ళి చేపలకోసం గాలం కర్రను విసుర్తున్నాడు వొడ్డుమీదుండి. దుకాణంలో కస్టమర్లు లేనప్పుడు రంగడి పోటి అది.

రాఘవులు నిట్టూరుస్తూ సొరుగులాగి 'గల్లాపెట్టె'లా ఉపయోగపడుతున్న గ్లాసులోకి చూశాడు. అర్ధరూపాయి చిల్లర కంటే వుండదందులో. నిరాశతో గ్లాసుని మళ్ళీ లోపలపెట్టేడు.

'ఇంత మందకొడిగా తయారైందేంటి యాపారం? ఇట్టాగైతే రోజు గడిచేదెట్లా. వెలదిరిగేవరికి నిట్టాడికి అద్దెగట్టేదెట్లా? ఇవాళన్నా నాలుగు డబ్బులొస్తే ఇంటి దానికి సూదిమందు వేయిద్దామనుకుంటేని. వారం రోజుల్నుంచీ కడుపునొప్పితో తన్నుకులాడుతోంది పాపం. ఏన్నిమందులువాడినా

# శిలలో సెలయేరు

గుణం కనపట్టంలేదు. పోయిన్నెల్లో పంచాయతీ గుమాస్తా నరహరి భార్య కూడా ఇట్టాగే కడుపులో నొప్పి, నొప్పి అంటూనే కడతేరిపోయిందిట! మాయదారి రోగం. అదొచ్చిన ఇరవైనాలుగ్గంటల్లో ఆపరేసను సేయిస్తే సేయించినట్టు, లేకపోతే ఖాళీ. అపెండిసైటీస్ అంటారుట దాన్ని. కొంపదీసి తన రత్తాలుకూడా అలాగే...

ఛీ..ఛీ...యదవాలోచన్లు మనిషి చేతినిండా పనిలేకపోతే ఇంతే; పురుగు తొల్చినట్టు మనసును తొలుస్తాయి: ఖర్మ కాకపోతే... ఒక్కడైనా ఇటొస్తాడేమో సూడు. కాలవమీది కళాసులొచ్చినా ఈరమ్మ దుకాణంలోకే జొరబడుతున్నారు. బియ్యంమిల్లువాళ్ళు టీనీళ్ళకి అడకే ఎల్తున్నారు; ఆఖరుకు ఇటునుంచి వచ్చే డేడ్యూటీ కానిస్టేబులుకూడా తన కొట్టువేపు కన్నెత్తికూడా సూడకుండా ఈరమ్మ పాకలోకే ఎల్తాడు...

రాఘవులు ఆలోచన్లను చెదరగొట్టూ, అతని టీ దుకాణాని కెదురుగా— రోడ్డుకి ఆవలివైపున లారీ ఒకటి ఆగింది. ఇటువేపు డోరు తెరచుకుని డ్రైవరు; అటువైపు డోరు తెరచుకుని కేబిన్‌లోని మరిద్దరు వ్యక్తులు దిగారు. వాళ్ళు ముగ్గురూ ఇటువేపే నడుస్తున్నట్లు తోచింది రాఘవులికి. 'ఫరవాలేదు. మూడు టీల బేరం తగిలింది. వాళ్ళొచ్చేవరికి రెడీ చేసి పెట్టే ఆలస్యంలేకుండా ఇచ్చేయొచ్చు. ఆలస్యంచేస్తే కస్టమర్లు రారు' అనుకుని టీ కలిపే ప్రయత్నంలో నిమగ్నమవబోయిన రాఘవులు ఒక క్షణం ఆగిపోయాడు. వాళ్ళుముగ్గురూ ఏదోమాట్లాడుకుంటూ లారీవెనక టైర్లలో గాలివుందో చూసుకుని ఇటు నడిచినట్టే నడిచి, చివరికి వీరమ్మ దుకాణంలోకి వెళ్ళారు.

తప్పనిసరిగా ఊపిరిపీల్చినట్లు నిరాశనూ అలవాటుచేసుకున్న రాఘవులి తలలో నటేశం మెదిలాడు. నటేశం కూడా లారీ డ్రైవరే. అతను రాఘవులి కస్టమరు, ఎన్నోసంవత్సరాలుగా అవసరమున్నా లేకపోయినా— ఆ రోడ్డంట వెళ్తున్నప్పుడు ఆ సెంటర్లో ఆగి రాఘవులిచేతి స్పెషల్ టీ తాక్కుండా వెళ్ళడతను.

వీరమ్మ ఆవూరు రాకముందు ఎక్కడుండేదో, ఏంచేసేదో రాఘవులికి తెలీదు. తెలుసుకోవాలనే ఉత్సుకతకూడా లేదతనిలో కాని నటేశం చెప్పాడు, వీరమ్మ సంగతి. ఆవిడది అనంతపురందగ్గర ఏదో వూరుట. పెళ్ళయి కాపురం చేసుకునే వీరమ్మ మనసులో పురుగు ప్రవేశించింది. పూలమొక్కలమ్ముకునే ఒక వ్యాపారితో అక్రమసంబంధం పెట్టుకుని విజయవాడ లేచివచ్చింది. ఆవిడ ముగ్గురు బిడ్డల తల్లికావడానికి కారణమైన ఆ వ్యాపారి హఠాత్తుగా అంతర్ధానమైనాడు. అతన్ని వెతుక్కుంటూ ఊరూరా తిరిగిన వీరమ్మ అలసిపోయి ఇక్కడ టీ దుకాణం పెట్టి విశ్రాంతి తీసుకుంటోందిట.

'విశ్రాంతిగాదు నటేశం. నా ఉసురు పోసుకుంటోంది. లేకపోతే ఏమిటి చెప్పు. అదక్కడ పొయ్యిలిగించింది నాకు రాబడి తగ్గిపోయింది. పిల్లలుగలది. ఆడదానికి ఎవరు పోటీ వస్తారు? పెద్ద విషయమేముందిలే. ఏవి పత్తాయిస్తున్నాయిగాని...' రాఘవులు ఆపైన మాట్లాడలేదు.

నటేశం నవ్వి......'ఏం జేత్తావేంటి?' అన్నాడు.

రాఘవులు నటేశం మాటల్ని విననట్టే కూచున్నాడు. నటేశమే తిరిగి అన్నాడు



'నీకేమైనా ఆలోచనుంటే చెప్పు. నేను పోయొస్తాగా!' అంటూ వెళ్ళిపోయాడు నటేశం.

రాఘవులి గుండె జల్లుమంది. వ్యాపారం పడిపోతున్నదన్న కసికొద్దీ అలా అన్నాడే గాని తనకు వీరమ్మ నేదో చేయాలనే తలంపే లేదు. నటేశం అన్నట్టుగా వీరమ్మను దారికడ్డం తీసేస్తే మటుకు అక్కడికి మరో పోటీదారు రాడని గ్యారంటీ ఏమిటి? 'మరి ఈ నటేశం ఇట్లా మాట్లాడిం దెందుకో! అతనికి ఈ వీరమ్మమీద కోప మెందుకు!' అని ఆలోచించాడు చాలారోజులు రాఘవులు. 'ఒకేళ నటేశం ఇసిరినగాలానికి ఈరమ్మ సిక్కుకోలేదేమో' తను అలా అనుకోడం పాపంగా తోచింది రాఘవులికి. అసలు సంగతేమిటో నటేశాన్నే అడుగుదా మనుకున్నాడుగాని 'ఛ మనకెందుకులే' అ పూర్కున్నాడు.

గతం గుర్తొచ్చిన రాఘవులు నిట్టూర్చాడు ...

'అరవైపైసలన్నా ఈయండి' (బతిమి లాడుతున్నట్లుగా అన్నాడు రంగడు. రాఘవులు వాడివేపు చూశాడు. వాడెటో చూస్తున్నాడు, రాఘవులి మొహంలోకి చూసే ధైర్యం లేనట్టుగా. పావలానుంచి అరవైపైసలకి దిగాడంటే, ఈ లోపల ఐదుపైసల విలువగల చేపల్ని పట్టేడనే సంగతి రాఘవులికి తెలియందికాదు.

'నువ్వే నయంరా, కాస్త కూస్తో సంపాదించావ్. ఈపూట నాకామాత్రం బోణీ కూడా కాలేదు' అనుకున్న రాఘవులు పైకిమాత్రం 'ఛ...పో.. యదవ...' అని కసురుకున్నాడు. రంగడు గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

ఆకాశంలో నల్లమబ్బులు ఢీకొన్నాయి. బోలు పెళ్ళున ఉరిమింది. వీరమ్మ దుకాణంలో కష్టమర్లు ఎవరో పెద్దగా నవ్వేరు. ఉండుండి వీరమ్మ కంచు కంఠం కూడా శృతి కలుపుతోంది ఆ నవ్వులతో.

ఇంటిదగ్గర రత్తాలు గుర్తుకొచ్చింది రాఘవులికి. 'ఉరుములంటే బయం దానికి. పైగా ఇప్పుడు సుస్తీగా కూడా వుంది. సూదిమందుకి సరిపడే డబ్బులు ఏలాగూ వచ్చేలా లేదీపూట. కనీసం అరకు, బిళ్ళలు కొంటానికైనా వస్తయ్యో, రావో అనుకుంటూ నాలుగువేపులా రోడ్లన్నీ గాలిస్తున్నాడు చూపులతోనే—ఒక్క బేరమైనా

తగలకపోతుందా అని?

రాఘవులి ప్రయత్నం వృథా పోలేదు. పడమటినుంచి వచ్చే రోడ్డుపైన ఓ ఇరవయ్యేళ్ళ కుర్రాడు నడిచొస్తున్నాడు. క్రమేపీ ఆ వ్యక్తి తన దుకాణంవేపే వస్తున్నట్లు నమ్మకం కలిగింది రాఘవులికి. అతనిలో అణగారుతున్న ఆశను పొగవూదే గొట్టంతో ఎవరో రగుల్కొలిపినట్లుయింది. కూర్చున్నవాడల్లా లేచి నిల్చుని, ఆశతోకూడిన చూపుల్తో అతనికి స్వాగతం పలికేడు.

ఆ వ్యక్తి దగ్గరకొస్తున్నాడు. వీరమ్మ దుకాణం వరకూ వచ్చాడు. వీరమ్మ దుకాణం దాటేడు. తన దుకాణంవేపే వస్తున్నాడు. ఇంతలో వీరమ్మ కంఠం ఖంగున వినిపించింది.

'రా బాబూ, రా. ఇట్రా. వేడేడి పరోటాలున్నై. కరకరలాడే పకోడీలున్నై. నిషా పుట్టించే గరమ్ వుంది రా...రా...'

ఆ వ్యక్తి ఆగిపోయాడు. తన ఎడమ భుజం మీదుగా తల త్రిప్పి వీరమ్మ దుకాణంవేపు చూశాడు. క్షణం తటపటాయించి, నాలుగడుగులు వెనక్కువేసి వీరమ్మ

# శిలలో సెలయేరు

దుకాణంలోకి జొరబడ్డాడు.

రాఘవులు నిర్ఘాంతపోయాడు. వీరమ్మ గడసరితనం అతనికి మహాపరాధంలా తోచింది. టీ కలిపేముందు తెర్లే నీళ్ళలా అతనిలోని 'రగతం' కుత కుత లాడింది. పళ్ళు పట పట లాడాయి. దూరానెక్కడో పిడుగు పడ్డంత శబ్దమైంది.

అదే సమయంలో రంగడు మళ్ళీ వచ్చాడక్కడికి. కొంత ఏడుపు, కొంత భయం, ఇంత ఉక్రోషం కలిసిన గొంతుతో అన్నాడు : 'నిన్న కూడా ఏమీ ఇయ్యలేదు. ఇవాళ పదిహేను పైసలన్నా ఇవ్వాలి. 'దెబ్బతో రా' ఆఖరు రోజియ్యాల.'

రాఘవులు జెయ్‌మని లేచాడు: 'గాడిద కొడకా, నీకు డబ్బులు కావాలంట్రా' అంటూ వాణ్ని కొట్టబోతే, వాడు పరుగెత్తిపోయి పరారైనాడు.

రాఘవులికి దెయ్యం పూనినట్లుయింది. ఆవేశంతో ఊగిపోతున్నాడు. ఒక్కచోటా కాలు నిలవడంలేదు. అతని ముఖం కూడా ఆకాశంలోని మేఘాల్లా నల్లబడింది ఏ క్షణంలోనైనా వర్షం పడేట్లుగా వుంది

వీరమ్మ దుకాణంలోనుంచి పెద్దగ కేరింతలు, నవ్వులు...రాఘవులు అటువేపుగా చూసుకపోయాడు.

'ఈరమ్మా, ఈరమ్మా...నీకిదేం బాగా లేదు.'

'ఏంది బుల్లోడా ?' వీరమ్మ రాఘవుల్నెప్పుడూ అలాగే పిలుస్తుంది. వీరమ్మ ముందు రాఘవులు బుల్లోడులాగానే వుంటాడు.

'నా దుకాణంలోకొచ్చే కష్టమర్ని పని గట్టుకుని పిలవడం న్యాయమేనా ?'

'న్యాయమేంటి బుల్లోడా, ఇది యాపారం. నీకు తెల్దేంటి. గాలమెయ్యకుండా చాపొచ్చి నీ వొళ్ళో పడుద్దా. అంతే ఇదీను.'

'నా దుకాణంలో కొచ్చేవోళ్ళని పిలవడానికి నీ కక్కర్లేదు. నీ దగ్గరకి వాడుగ్గా వొచ్చేవోళ్ళని పిల్చుకో అంతే గాని...'

వీరమ్మ ఫక్కున నవ్వింది. వీరమ్మ విరగబడి నవ్వింది. కొయ్య బెంచీలపై కూచున్న కస్టమర్లు కూడా నవ్వేరు. టీ తాగుతూ నవ్వడంచేత వాళ్ళకి పొలమారి వాళ్ళ నవ్వు దగ్గుగా మారింది.

'పిచ్చోళ్ళా వున్నావే. నా దగ్గరకొచ్చే వోళ్ళని నేనం పిలవక్కర్లా. నీవాళ్ళనే పిలవాలి' అని మళ్ళీ నవ్వసాగింది వీరమ్మ.

రాఘవులికి వొళ్ళంతా జెర్రులు పాకినై. తన చేతగానితనం, రత్తాలు మూలుగు, 'నేను సాయపడ్తాగా' అన్న నటేశం మాటలు, రంగడు డబ్బు లడగడం, వీరమ్మ నవ్వు— ఇవన్నీ అతని బుర్ర చుట్టూ గిరికీలు కొడుతున్నాయి.

'అంతా నవ్వాకీరమ్మా, కాస్తుంచుకో. ముందు శానా బతుకుంది. పూలమొక్క లోళ్ళు పూలు పూయిస్తాధు మళ్ళీ. అప్పుడు నవ్వుదుగాని.'

'ఏడిస్టూ, ఏం కాశావ్, మళ్ళీ కుయ్' అంటూ బయటికొచ్చింది వీరమ్మ

'ఏం, కొడ్తానా ?' ఉన్నమాటంటానికి నాకేం బయమంట..' బింకంగా అన్నాడేగాని రాఘవులికి గుండెల్లో బితుకు, బితుకు మంటోంది.

'కొడ్తావా, కొట్టి చూపిస్తావా నీజేబ అడ్డమొస్తుందేమో చూస్తా' అంటూ చేతిలోవున్న జర్మన్ సిల్వర్ గరిటతో రాఘ






# ఒక వారం విపరీతం పాలాక్షుడు

## దారుణ హత్యకి దారితీసిన కక్షలు

గుంటూరు జిల్లాకు చెందిన సత్తెనపల్లి గ్రామం వద్ద జూన్ 30వ తేదీన పి. వెంకటేశ్వర్లు అనే ఆయన్ను ఒక ఏడుగురు కత్తులతో, కటార్లతో మీదపడి దారుణంగా చంపేశారట. ఈ ఘోర కృత్యానికి పాతకక్షలే కారణమట.

## బస్సులో ప్రసవం

తుమ్మకపల్లి గ్రామానికి చెందిన పైడిముత్యాలు అనే గర్భిణీస్త్రీ పురుడు పోసుకోడానికి బస్సులో విశాఖపట్నానికి బయలుదేరిందట. కూడా ఆమె భర్త సిర్నన్న కూడా వున్నాడట. బస్సు పెందుర్తి అనే వూరినుంచి బయలుదేరగానే (జూలై 2వ తేదీ రాత్రి) ఆమెకు నొప్పులు ప్రారంభమయ్యాయట. వెంటనే బస్సును ఓ ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వద్ద నిలిపారట. కానీ, డాక్టరొచ్చేలోగానే ఆమె ప్రసవించేసిందట. తల్లీ, పిల్లా ఖులాసాగా వున్నారట.




## గోడ విరిగిపడి ఎనిమిదిమంది మరణం

బొంబాయికి ఉత్తరాన్న ప్రాంతంలో వున్న చెంబూరులో ఓ యింటి గోడ విరిగి, పక్కనున్న మూడు గుడిసెల మీద పడిందట. తత్ఫలితంగా ఆ గుడిశలలో వుంటున్న వారిలో ఎనమండుగురు నలిగి, చనిపోయారట. అక్కడ కురిసిన భారీవర్షాల ప్రభావమే ఆ గోడ కూలడమని అంటున్నారు.

## జాక్ పాట్

ఆదివారం బెంగుళూరు గుర్రప్పందాలలో పుట్టస్వామిగౌడ అనే 23 ఏళ్ళ కార్మికుడు కొన్న ఒకే ఒక్క టిక్కెట్టుకు 4,69,226 రూపాయలు లభించిందట.

*　*　*

నా ప్రజలలో కొందరు (మన దేశంలో వున్న పాకిస్తాన్ యుద్ధఖైదీలు) కటిక నేలమీద పడుకుంటూంటే నేను హాయిగా మంచం మీద ఎలా పడుకోగలను? అందుకే నేను మంచం మీద పడుకోటంలేదు అన్నారట పాకిస్తాన్ ప్రసిడెంటు జడ్. ఎ.

భుట్టో— అదిసరి! మరి తిండిబట్టలో!

## హత్యకి దారితీసిన కలహం

వేలూరు అక్కారకారం అనే గ్రామానికి చెందిన 35 ఏళ్ళ అప్పాసామి అనే రిక్షా అతనికి, కాప్పికారన్ అనే రిక్షా అతనికి పొట్లాట వచ్చిందట. ఆ కాప్పికారాన్ని అప్పసామి ఓ రోజు చితకతన్నాడట. కాప్పికారన్ యీ విషయాన్ని తన స్నేహితుడు సుబ్రహ్మణ్యానికి చెప్పాడట. ఆనక వారిద్దరూ కలసి అప్పాస్వామిని చావబాదారట. చావు దెబ్బలతో అప్పాసామి యింటికొచ్చి తన భార్య రేణుతో జరిగిన సంగతి చెప్పాడట. దాంతో రేణుకు కోపం వచ్చి తనభర్తను తన్నినవారిని నానాశాపనార్థాలూ పెట్టి పెద్దగా తిట్టనారంభించిందట. ఈ తిట్లువిని, ఆగ్రహంతో సుబ్రహ్మణ్యం రేణు పొట్టలో చేత్తో బలంగా గుద్దాడట. తన భార్యను కొట్టిన సుబ్రహ్మణ్యాన్ని అప్పాసామి కత్తితో పొడిచి చంపేశాడట.

## అశాంతి – ఆత్మహత్య

సెన్‌పాకానికి చెందిన మునుసామి అనే ఒకతను పనికోసం వేలూరు వచ్చి అక్కడ నడిబజారులో విషంతాగి, చనిపోయాడట. ఈతని ఆత్మహత్యకు కుటుంబంలోని అశాంతే కారణమట ఈతని భార్య సుందరి అనే అమ్మాయట. వీరికి పిల్లలు లేరట.

*　*　*

హుబ్లీకి చెందిన ఒక వూరిలో ఓ కంపెనీలో పని చేస్తున్న సత్యనారాయణ అనే అతను రహిమాన్ అనే అతని చెల్లెలు కూతుర్ని ప్రేమించాడట. వారిద్దరూ ఎవరికి చెప్పకుండా వూరు వదలి, హుబ్లీ రైల్వే స్టేషనుకు చేరేసరికి రహిమాన్ అక్కడికి వచ్చి వారి మీద పోలీసులకు ఫిర్యాదు చేస్తే, స్టేషను పోలీసులు వారిని నిర్బంధంలో వుంచారట. రాత్రి పూట సత్యనారాయణ లఘుశంక తీర్చుకుని వస్తూండగా రహిమాన్ అతన్ని పొడిచిచంపి, పారిపోయాడట.

## కారణం తెలియని దారుణం

జూన్ 26వ తేదీ సోమవారం రాత్రి కడపజిల్లా గోపాలవారి పల్లెలో చెన్నారెడ్డి అనే ఆయన యింటి మీద ఓ 15 మంది తుపాకులతో దాడిచేసి, ఆయన తండ్రిని, తాతగారిని, పిచ్చయ్యరెడ్డి అనే ఆయన్నూ కాల్చి చంపి, మరో అయిదుగుర్ని గాయపరచి పారిపోయారట— కారణం తెలీదు.

## రెండు నెలల తేడాతో ఇద్దరు పిల్లలు!

కొత్తగూడెంకు 50 కిలోమీటర్ల దూరంలో వున్న తిరుశాలి గ్రామంలో శ్రీమతి తార అనే ఆమె రెండు నెలల్క్రితం ప్రసవించి, తిరిగి మళ్ళీ జూన్ 24వ తేదీన ఒక మగశిశువును కన్నదట. ఈ పిల్లలిద్దరూ కూడా నెలలు (తొమ్మిది) నిండిన మీదటే పుట్టారట.

## భూసంస్కరణలు భార్యలకు విడాకులు!

భూముల మార్పిడిలను నిషేధిస్తూ మే రెండవ తేదీన గవర్నరు చట్టం చేసిన నాటి నుంచి (ఆంధ్రప్రదేశ్‌లో) తమఆస్తులను రక్షించుకోడానికి వేరా మార్గాంతరాలు లేక ధనవంతులు సుమారు నాలుగొందల మంది తమ తమ భార్యలను వదలి వేశారట. ఈ విషయం రాష్ట్ర శాసనసభలో కమ్యూనిస్టు నాయకుడు శ్రీ వి. కృష్ణ చెపుతూ, కొంతమంది గుటగుట పిల్లలను (మగ) దత్తత తీసేసుకుంటున్నారని కూడా ఆయన అన్నారట. కుక్కల వంటి పెంపుడు జంతువులకు కూడా భూస్వాములు తమ ఆస్తులను కట్టబెట్టచ్చని ముఖ్యమంత్రి అన్నారట— ఫన్నీ..

## పేవ్‌మెంట్ ప్రమాదం

ఢిల్లీలో జాంగ్పూరా కాలనీలోని రాజదూత్ హోటలు సమీపంలో కొంతమంది పేవ్‌మెంటు మీద నిద్రపోతూంటే (30వ తేదీరాత్రి) ఓ కారు గతితప్పి వారిమీదుగా పోయిందట. తత్ఫలితంగా ఇద్దరు చనిపోవడం, పదిమంది గాయపడడం జరిగిందట— పోనీ కార్లే పేవ్‌మెంటు మీద నడవాలనీ, జనం రోడ్డుమీద నడవాలనీ రూల్సు మారిస్తే! అప్పుడు కార్లు పేవ్‌మెంటు మీద నడవ్వు.



ఢిల్లీ సుభాష్‌నగర్‌కు చెందిన శివాటీలాల్ అనే ఆయన ఏడేళ్ళ క్రితం షీలాదేవి అనే ఆమెను పెళ్ళి చేసుకున్నాడట. అప్పటికే ఆయన యిద్దరు పిల్లల తండ్రిట. ఇటీవల ఆయనకూ ఆయన భార్యకూ మనస్పర్థలు రావడం వల్ల ఆయన భార్య షీలాదేవి సుభాష్‌నగర్‌లోనే వున్న తనతల్లితో వుంటోందట. మొన్న ఒకటవ తేదీన శివాటీలాల్ తన అత్తగారింటికి వెళ్ళి, భార్యను తనతో వచ్చెయ్యమన్నాడట. ఆమె అందుకు ఒప్పుకోనందువల్ల ఆగ్రహంతో శివాటీలాల్ ఆమెను పొడిచిచంపి, అడ్డొచ్చిన అత్తగారిని పొడిచి, పరారై పోయాడట.

*　　*　　*

మన్నవ అనే ఊరిలో వివాహానికి ఏరారు తప్పకుండా రావాలని ఓ నలుగురు పెద్ద మనుష్యులు గోగులపాటి నరసింహం అనే ఆయన్ను, ఆయన భార్య కోటమ్మను పెదకూరపాడు గ్రామం నుంచి తీసుకు వెళుతూ దారి మధ్యలో వారిద్దర్నీ పొడిచి రోడ్డు




పక్కకు లాగేసి, పారిపోయారట వారు. (జూన్ 29వ తేదీన). నరసింహం చనిపోయాడట. ప్రాణాపాయ స్థితిలో వున్న కోటమ్మను మాత్రం దారిపోయే వారు చూసి, ఆసుపత్రిలో చేర్చారట. కోటమ్మ, నరసింహం హరిజనులట.

## భార్యా బిడ్డలకు విషం ఎక్కించి ఆత్మహత్య చేసుకున్న డాక్టరు

హైదరాబాద్‌కు చెందిన 35 ఏళ్ళ విఠల్‌రావు అనే డాక్టరు, తన భార్య, ముగ్గురు పిల్లలతో మద్రాసు వెళ్ళి, అక్కడ నుంచి తిరుపతి వెళ్ళి 23 వ తేదీ నాడు శ్రీవారి దర్శనం చేసుకున్నారట. ఆనక సత్రానికి చేరాక, విఠల్‌రావు ఇంజక్షన్‌తో విషం ఎక్కించి, తన భార్యకు, ముగ్గురు పిల్లలకూ యింజక్షనిచ్చి, తానూ పొడుచుకున్నాడట. కాస్సేపటికి వాళ్ళున్న గదిలోంచి ఏవో అరుపుల వంటివి వినిపించాయని పక్క గదిలో వుంటున్న యాత్రికులు చెప్తే, పోలీసులు వచ్చి, తలుపులు తెరచి చూస్తే లోపల ఆయన భార్య, ముగ్గురు పిల్లలూ చనిపోయి వున్నారట. ఆయన్ను ప్రాణాపాయస్థితిలో ఆసుపత్రిలో చేర్పినా, ఫలితం లేక ఆయనా చనిపోయారట. విఠల్‌రావుకు చెవిలో పోటు వచ్చేదని, దీనికి పెద్ద ఆపరేషను చేయవలసి వుందని, ఆ ఆపరేషను చేస్తే, అదృష్టం బాగుండకపోతే పిచ్చివాడుగా తయారయ్యే ప్రమాదముందని తోటి డాక్టర్లు అనడంతో, జీవితం మీద రోత పుట్టి ఆయనీ ఘాతుకం చేసినట్లు అంటున్నారు. ●










ఎస్. కె. ఆర్, గుంటూరు

**పంచశీలములకు నాలుగే శీలమనుటు తెలిపారు. వదిలేసిన ఆ ఒకటి ఏమిటి?**

అసత్యమాడకుండుట.

వి. వి. డి, పెద్దదోరాబాదు

కార్టూనులు వేయడం అంటే నాకు మహాసరదా. చాలా కార్టూనులు పంపాను. జవాబు లేదు.

పంపిన కార్టూనులు— యిదివరకే పత్రికలలోనైనా వచ్చేసి వుండొచ్చు, లేదా అవి సంపాదకునికి నచ్చకపోయీ వుండొచ్చు. ఈమధ్య కార్టూనులు మరీ చౌకబారుగా వస్తున్నాయి. పదేసి పైసల స్టాంపంత బొమ్మ వెయ్యడం— ఓ పెద్ద వ్యాఖ్య రాయడం. గాడిద బొమ్మ వేసి గాడిద అని కింద రాయవలసి వస్తే యింకది కార్టూనేమిటి?!

కె. ఎస్. ఆర్. పి. వాల్తేరు

కవిత్వం రాయడానికి 'మూడ్' కావాలంటారు అంటే ఏమిటి?

అది బూర్జువా కవిత్వం రాయడానికే—కాని యిప్పుడా గొడవ లేదు. కూర్చుని రాసేస్తున్నారు—పోయ్ కాదాలు!.. ఇప్పటి పోయెట్స్ అంతా మాటలతో యీగెలు వేసేవాళ్లే కదా.

జి. జి. ఆర్, ఇజ్జవరం

ఊహలు ఉద్దేశ్యాలతోకి రావాలంటే?

చేతల్లోకి దిగాలి.

పి. ఆర్. ఆర్, ఉండ్రాజవరం

...యింత స్వార్థం, సంకుచితత్వం వదిలకుగా ప్రవచిస్తూ పత్రికలలో సాహిత్యం రాసుకొనే వీళ్ళు రాష్ట్రాన్ని ఏలే నాయకులా? ఈ రాష్ట్రాన్ని ఈ నాయకత్వాన్ని చూపి మీరెందుకా అభిమానం చూపుతారు?

తెలియని దేవతల కంటే తెలిసిన దెయ్యాలు మేలు. ఈ ప్రభుత్వం కాదు. ఏ ప్రభుత్వం పరిపాలనా, యంత్రాంగం చేపట్టినా చేసేదిదే— పద్ధతులు వేరవచ్చు. అధికారం బుద్ధి పెడతలని పట్టిస్తుంది.

సి. జి. ఎస్, వాయల్‌పాడు

ఒక రచన అరఠావు...అంటారు. కవరుకు తగినన్ని స్టాంపులు అంటించమంటారు. అంటే?

మీరెవ్వరినీ అడగక్కరలేదు. కోట్లో అరఠావు సైజు కాగితాలిమ్మంటే వాడే యిస్తాడు! యిక బరువు తూచి స్టాంపులు అంటించకపోతే ఎక్కువైతే మీకు నష్టం తక్కువైతే పత్రిక వారికి చేతి చమురు! అందుకని అలా రాస్తారు. పోస్టాఫీసులో మీరు కథ పెట్టి అంటించిన కవరు తూచి ఎన్ని స్టాంపులు అంటించాలో చెప్తారు.

బి. ఎస్. సఖినేటిపల్లి

కులమత భేదాలపై మీ అభిప్రాయం?

ఈ కాలంలో కొందరి కవి— వరాలు కొందరికవి అవరోధాలు. కొందరు వాటి పేరు చెప్పుకొని పెరపెర పైకెగ్రబాక కల్పుతున్నారు. కొందరు వాటివల్ల పీడింపబడుతున్నారు. పట్టించుకుంటే, వీటంత గొప్పాలేదు. వీటంత సంకుచితత్వం లేదు.

కె. పి. బి, చాండిఘర్

ఇలా ప్రశ్నలకు జవాబులివ్వడంవల్ల మీకేం లాభం వుంది?

ఎంత దూరం పోయినా తెలుగువాడి వనిపించు కున్నావు తమ్ముడు, లాభం లేని పని చేస్తావా నువ్వు? నే చెయ్యను!

బి. సి. పి, తుమ్మెర

హాయిగా జీవించాలంటే ఉద్యోగమా? వ్యవసాయమా? కూలియా?

రాజకీయాలు!

దేవుని ముందర నిలబడి దేవునికి మొక్కుమన్నపుడు దేవుడు కనబడునా? విగ్రహము కనబడునా?

అది మొక్కే వాడిని పట్టి వుంటుంది.

జె. ఎ. కె, వేములవాడ

మనిషికి మట్టికి సంబంధవుంటే మరి ఆకాశానికి ఎందుకా సంబంధం లేదు?

ఎందుకు లేదు? మన ప్రాణవాయువులు ఆకాశంలోకి, మన శరీరం మట్టిలోకి—కదా.

కె. డి. సిహెచ్, కొత్తగూడెం

**తమ కవితలతో ప్రజలలో చైతన్యాన్ని అభ్యుదయాన్ని తీసుకురావలసిన కవులు డబ్బుకోసం చెత్త రచనలు చేస్తూ కూడా ఇంకా అభ్యుదయవాదాన్ని విడనాడకుండా రచనలు సాగిస్తూవుంటే వాటికి సరైన విలువ ప్రజలు మనస్ఫూర్తిగా యిస్తారంటారా?**

ప్రజలు తామివ్వదలచుకున్న విలువ యిస్తారు. ధనార్జన అభ్యుదయానికి ప్రతిబంధకం అని ప్రజలను కుంటే మరి కవిపుంగవులంతా ఏం తిని బ్రతకాలో కూడా ఆ ప్రజలే చెప్పాలి కదా?! ఒక కవిగా, ఒక రచయితగా తన ఆదర్శాలని అమ్ముకుంటూ యీ దేశంలో ఎవరూ బ్రతకలేరు. అంచేతే—భుక్తి కోసం ఏదో ఒక వృత్తి చేపట్టాలి. రాయకల్గిన వాడు దాన్నే వృత్తిగా చేపడతాడుగాని— పోయి హార్బరు కూలీగా బ్రతకలేడు. హార్బరు కూలీ అడపాతడపా కవిత్వం రాయకలదేమో గాని, రచయితగానే తొలి నుంచీ బ్రతికే వాడు కూలీ పనికి వెళ్లలేడు.

సి. ఎమ్. ఆర్, మహల్‌రాచపల్లె

(చిత్తూరుజిల్లా)

ఈ రోజుల్లో డబ్బు ముఖ్యమా? మనిషి ముఖ్యమా?

సంపాదించే మనిషి.

వి. ఎస్. బిహెచ్. ఆర్, పలనునేరు

ఈ కాలంలో చదువుకొన్న స్త్రీకి విలువెంత?

ఆమె ఉద్యోగం చేస్తూ వుంటే—ఆ జీతాన్ని పట్టి వుంటుందామె విలువ.

ఈకాలం స్త్రీలు చదువుకున్నా చివరికి పోవలసింది వంటింట్లోకే?

లేకుంటే మీలాంటి పురుషసింహాలకి బువ్వ ఎక్కడి నుంచి వస్తుంది?

ఆర్. బి, హన్మకొండ

జంతువులని మనుషులు వేటాడుతారు. కాని, మనుషుల్ని ఎవరు వేటాడుతారు?

ధనికులనైతే— టాక్సువాళ్ళు పేదవాళ్లనయితే అప్పులవాళ్ళు.

ఎ. ఎస్. ఆర్, చ కధర్‌పూరు

జీవితంలో మరువలేనిది ఏమిటండి?

స్వసుఖం.




స్థానభ్రంశము చెందితే రాణించని వస్తువులలో నరుడూ ఒకడు. ఆ సంగతి చిన్నప్పుడు సూన్నాణ చదువుకున్నాడు. అయితే ప్రస్తుతం అతను ఆ విషయం మర్చిపోయాడు; కనుకనే అంత అవమానం పొందాడు. మానవుడికి స్వతహాగా సంక్రమించిన స్వభావాల్లో తన మీదనే జాలి పడటం అతిముఖ్యమైనట్టిది. ప్రస్తుతం సూన్నాణ ఆ స్థితిలో వున్నాడు.

బాగా పెరిగి దుబ్బులాగా అయిన గడ్డం. అస్థి పంజరం వలె అయిన శరీరం. నరాల్లో నీరసం. కడుపులో ఆకలి. చిరిగి పేలికలయి మురికిపోడుతున్న బట్టలు. అసహ్యంగా వాసన వేస్తున్న శరీరం. లోతుకుపోయి గాజు బుడ్డవలె మెరుస్తున్న కనులు. తన అవతారాన్ని ఇప్పుడు తనే గుర్తు పట్టలేడు సూన్నాణ. అతనికి కర్మ ఫలిపాకం వలన సంక్రమించిన అవతారం అది!

గేటు ముందున్న గూర్ఖా సూన్నాణ వంకే క్రూరంగా చూస్తున్నాడు. ఆ చూపు సూన్నాణ నరాలు వొణికించి గజ గజా లాడిస్తున్నది.

గేటుకి కొత్తగా రంగులు వేయించి నట్టుంది. మేడమీద మరో అంతస్తు వెలిసింది కొత్తగా. అంతకు ముందు ఆ మేడకి లేతాకు పచ్చరంగు వుండేది. ఆ రంగు పోయి ఎర్రరంగుని కొత్తగా అలంకరించుకుంది మేడ.

గేటు దగ్గర 'కాంపౌండు వాలు' చలువ రాతి పలక మీద నిక్షిప్తమయి బంగారు తళుకు వేసిన అక్షరాలు వెలుగుతున్నాయి— 'సుభద్రా నివాస్' సూన్నాణకి ఆశ్చర్యమనిపించింది! అతనికి తెలిసినంత వరకూ ఆ మేడ పేరు వేరుగా వుండాలి. ఆ మేడని సూన్నాణే కట్టించాడు. అసలు అందులోని ప్రతి అంగుళమూ శ్రద్ధ తీసుకుని నిర్మింపచేశాడు సూన్నాణ. అది సూన్నాణ స్వార్జితంలో కట్టుకున్న మేడ. తన ఆశల్ని, ఆలోచనల్ని కలబోసి జాగ్రత్తగా కట్టుకున్నదది. సూన్నాణ భార్యపేరు రాధమ్మ. ముచ్చటయిన అక్షరాల్ని ఎంపిక చేసి 'రాధామందిర్' అని పేరు పెట్టుకుని, ఆ పేరు రాయి మీద చెక్కించి కాంపౌండు గోడలో అదే చోట అమర్పించాడు సూన్నాణే దగ్గిరుండి స్వయంగా ఒకనాడు.

మరి అట్లాంటిది ఆ ఫలకంపోయి; దానిస్థానంలో కొత్తది చోటు చేసుకుంది. అది ఎట్లా జరిగిందో, ఎప్పుడు జరిగిందో సూన్నాణకి తెలియదు.

సూన్నాణకి కళ్ళవెంట – [illegible] తిరిగింది.

# నరవాసన

గుండెలు బాధతో ఆక్రోశించాయి.

కడుపులో పేగులు ఆవేదనతో మెళ్ళు తిరిగాయి.

చాలాకాలం తర్వాత ఎంతో ఉత్సాహంగా, ఆప్యాయత నింపుకున్న గుండెతో ఆ ఇంట్లోకి అడుగు వెయ్యబోయిన మూన్నాజని గేటుదగ్గర గూర్ఖా అటకాయించి అరగంట కాలేదు, ఇంకా.

సరిగ్గా అప్పుడే బొయ్యిమని చప్పుడు చేస్తూ వచ్చింది అందమయిన కారు. ఆ కారు మూన్నాణకి బాగా తెలుసు. అందులో కూర్చునే మూన్నాణ గతంలో అనేకసార్లు ఆ మేడ ఆవరణలోకీ, బయటికీ వెళ్ళాడు.

ఆ కారులో వెనక సీటులో చేరబడి కూర్చున్న మనిషి— ఆ మనిషి మూన్నాణని చీత్కారంగా చూశాడు. పురుగుని చూసినట్లు చూశాడు. 'నాన్నా!' మూన్నాణ పిల్చాడు. ఆ పిలుపుని 'అతను' విన్పించుకోలేదు.

'ఏయ్! అడ్డులే.' గూర్ఖా గదమాయించాడు.

'నేను. నేను. నన్ను లోపలకు పోనీ' మూన్నాణ గొణిగాడు.

'అరే. 'పాగల్' లెమ్మంటుంటే— నిన్ను జాదూ!' మెడపట్టుకుని ఇవతలకి ఈడ్చాడు గూర్ఖా మూన్నాణని.

కారు లోపలికి వెళ్ళిపోయింది.

మూన్నాణని ఈడ్చుకుని దూరంగా తీసుకెళ్ళి వదిలేశాడు గూర్ఖా.

'అరేయ్! నా మీద చెయ్యి వెయ్యటానికి ఎన్ని గుండెలు! నేను ఈ ఇంటి యజమాన్నిరా.' మూన్నాణ కీచు గొంతుతో అరిచాడు.

'అరె 'పాగల్.' నువ్వు యజమానివా? బద్మాష్. సలామలేకుం యజమాన్కీ.' అంటూ ఒంగదీసి దబ దబమని గుద్దాడు గూర్ఖా. 'మరలా ఆ మాట అన్నావా? ఖంపేస్తాను' అని గర్జించాడు.

మూన్నాణకి నోరు పెగిలిరాలేదు. కళ్ళ వెంట నీరు జల జల కారింది.

ఆకలికి పేగులు అరిచాయి.

'మరలా గేటు దాపుకి వచ్చావో ప్రాణాలు తీస్తా మల్లా. జాగర్తరా బేవాకూఫ్.' అని హెచ్చరించి మూన్నాణని ఎత్తి కుదేసి, గూర్ఖా తిరిగి గేటువద్దకు వెళ్ళిపోయాడు.

సూర్యుడు పైకొచ్చాడు. ఎండ కర కర లాడుతోంది.

వొచ్చే కార్లు వస్తున్నాయి. పోయే కార్లు పోతున్నాయి. గూర్ఖాగాడు కార్లకి సలాంలు కొడుతున్నాడు. మూన్నాణవంక ఖంపేస్తానన్నట్టు చూస్తున్నాడు.

తన పిల్లలు ఏమయ్యారు? తన భార్య ఎట్లా వుంది? అసలు తనకేమయింది? ఈ ప్రశ్నలు మూన్నాణని వుక్కిరి బిక్కిరి చేశాయి.

నీర్సంగా నడిచి వీధి కొళాయి దగ్గరకి వెళ్ళి కడుపునిండా నీళ్ళు తాగేడు మూనాణ. ఇంతలో బ్రరుమని వచ్చరంగు కారు దూసుకువచ్చి గేటు ముందు ఆగింది. గూర్ఖా సలాములు చేస్తూ గేటు తీస్తున్నాడు. ఆ కారులో తళ తళ దుస్తులలో విలాసంగా కూర్చుంది ఒకామె. ఆమె ప్రక్కన ఒదిగి కూర్చున్న ముసలామె! ఆమెని గుర్తించాడు మూన్నాణ. ఆమె! ఆమె మూన్నాణకి బాగా తెలుసు!

కొండంత బలం తెచ్చుకుని అటు పరుగు పెట్టాడు మూన్నాణ.

'ఇదిగో! విన్నే. నన్ను గుర్తించలా?' అని అరిచాడు, కీచుగా.

కార్లో కూర్చున్న ముసలామె తల తిప్పి అతన్ని చూసింది. ఆమె ఏదో అనబోయేంతలోనే కారు కదిలి బ్రరున లోపలికి దూసుకుపోయింది.

నిరాశగా వెనక్కి తిరిగేడు మూనాణ.

పిచ్చెక్కినట్టు ఘోష పెట్టింది మనస్సు.

నీరసంగా అడుగులువేసి మేడకి దూరంగా వెళ్ళిపోయాడు మూనాణ.

రోడ్డుమీద కార్లు; బస్సులు, టాక్సీలు — తీరికలేనట్టు విపరీతమయిన వేగంతో దూసుకుపోతున్నాయి. ఎవరో తరుముకు వస్తున్నట్టు మనుషులు గబ గబా నడిచి పోతున్నారు. షాపులు కళ కళ లాడుతున్నాయి. హోటళ్ళునిండా మనుషులు కిటకిట లాడుతున్నారు జనం. నేల ఈనినట్టు విపరీతమయిన జనం!

పక్కవాడిని గురించి ఆలోచించే ఓపికా, తీరికా ఎవరికీ వున్నట్టు లేదు. మూన్నాణ ఆ పరిస్థితిలో తన గోడు ఎవరికి చెప్పుకునేట్టు? ఎవరు వింటారని?

తను ఎవరికీ అవసరంలేదు. తన కొడుకు తనని ఛీత్కరించాడు! పాతికేళ్ళు సంసారం చేసినా భార్య తనని గుర్తించనట్టు వెళ్ళిపోయింది! తన బ్రతుకు అడివి బ్రతుకయింది. తను ఎవరికీ కాకుండా మిగిలిపోయాడు!

ఈ ప్రపంచంలో ఎవరికెవరు?

అదేమాట ఇరవై సంవత్సరాల క్రితం తానే అన్నాడు, తన నోటితోనే.

'బాబూ! నా ఆశలన్నీ నీ మీదే పెట్టుకున్నాను. నీ తెలివితేటలవలన నువ్వు పైకి వచ్చావు. నాకు చాలా సంతోషంగా వుంది. ఇక తమ్ముళ్ళని, చెల్లెళ్ళని ఉద్ధరించి నన్నూ మీ అమ్మనీ కడతేర్చవలసిన బాధ్యత నీదే నాయనా' అన్నాడు.తన ముసలి తండ్రి, తనకి జన్మ ఇచ్చిన తండ్రి,తన అస్తిత్వానికి కారణభూతుడయిన కన్నతండ్రి!

అప్పుడు తన వ్యాపారం ఉచ్ఛస్థితిలో వుంది. చేతినిండా డబ్బు, సంఘంలో పరపతి. హోదా, తల్చుకుంటే 'అది' తనకొక లెక్కలోది కాదు. ఒకరకంగా చూస్తే అది తన బాధ్యత కూడా.

కాని స్వార్థాన్ని ప్రక్కకినెట్టి బాధ్యతని నెత్తిన వేసుకోటానికి మనిషికి ఉదారమయిన హృదయం కావాలి. మంచి మనస్సు వుండాలి. అయితే అప్పుడు తనని నడిపించింది తన స్వార్థం. తన భార్య 'ఆ విషయం'లో ఎంతగానో ప్రయత్నించి తన మనస్సు మార్చాలని చూసింది. తనే బిగుసుకు పోయాడు. 'నీకెందుకు? నోర్మూయి'అని భార్యని విదిలించి కొట్టాడు. పాపం! తన తండ్రి ఎంతగానో బాధపడి వెళ్ళిపోయాడు.

మనిషికి రెక్కలు రాగానే— తన కాళ్ళమీద తను నిలబడే స్తోమతు రాగానే— చిత్రంగా మారిపోతాడు. స్వార్థంతో కూడిన ఆ మార్పు పాషాణ సదృశంగా అవుతుంది. చిత్రం! ఆ మనిషే పుట్టగానే కేరుమంటూ తల్లికోసం వెతుకుంటాడు. అది అవసరం.

ఆ తల్లి తన బిడ్డకోసం ఏ త్యాగం చెయ్యటానికయినా సిద్ధపడుతుంది. అది స్వార్థంతో కూడిన నిస్వార్థం. కాలం గిర్రున తిరగగా. మనిషి శారీరకంగా మానసికంగా ఎదిగినాక, కొంత వయస్సు వచ్చేసరికి అతని ఆలోచనల్లో పరిణతి కనపడుతుంది. ప్రపంచాన్ని అర్థం చేసుకుంటున్న

కొద్ది మనస్సుకున్న ఆ పరిధి సరకూనిత మవుతుంది.

ఒక దశవరకూ, నేను నా తల్లి తండ్రులు, నా అన్న దమ్ములు, నా అక్కచెల్లెళ్ళు అని ఆలోచిస్తాడు మనిషి. తర్వాత ఒక విచిత్రమయిన పరిణామంతో మనిషి ఆలోచన్లు పూర్తిగా మారిపోతాయి. కొత్త నీటికి పాతనీరు కూడా కొట్టుకు పోయినట్టు కొత్త ఆలోచనలు పాత ఆలోచనల్ని పూర్తిగా నామరూపాలు లేకుండా చేస్తాయి.

ఆ పాత కొత్తల మధ్య సంఘర్షణే జీవితంలో కొత్త మలుపులు తీసుకుసన్తుంది. బాధ్యతల్ని నక్కకినెట్టి కర్తవ్యానికి కత్తిరింపులు చేసుకుంటాడు.

అప్పట్నుంచి ఆ మనిషే నేను, నా భార్య, నా పిల్లలు అని ఆలోచిస్తాడు.

ఆ దశలో కొంతకాలం గడిచేక మరలా కొత్త వచ్చి పాతని తుడిచేస్తోంటే ఆ మనిషే విపరీతంగా బాధ పడతాడు. అయినా తప్పదు. నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష అని అంతా ఆ నీరజాక్షుడి లీల!

అంతా మిధ్య.

ఏదీ శాశ్వతంగాదు.

చిత్ర మేమిటంటే అశాశ్వతమని బుజా

# సరిహాసన

వమే వరకూ మనిషి తనూ, తన నమ్మకాలూ, తన ఆలోచనలూ శాశ్వత మనుకుంటాడు. తన నమ్మకాలు నమ్మయిన రోజున ఎంతో బాధపడి ఆక్రోశిస్తాడు. మనిషి మిధ్యలోపడి కొట్టుకుంటున్నాడన టానికి ఇది ప్రబల నిదర్శనం.

'నేనూ, నా తల్లిదండ్రులూ, నాతోడ బుట్టినవాళ్ళూ' అనుకున్న ఆ నమ్మకం ఎట్లా మిధ్య అయిపోయిందో అల్లాగే మిధ్య అయిందని సరిపెట్టుకోటానికి మనిషి సుతరామూ ఒప్పుకోడు. అదే మాయ! మనసులోని గిజిగాని గజిబిజి!

కనుల పొరలు విడిపో... నిజం కళ్ళెదుట నిల్చినప్పుడు వాస్తవాన్ని అంగీకరించలేక బాధపడటంలోనే బుజావవుతుంది మనిషి పడి కొట్టుకుంటుంది మాయలో నేనని!

మనిషి ఇంత స్వార్థపరుడుగా ఎందుకు మారతాడు? అన్న ప్రశ్న వస్తుంది. అప్పేదు ఆ ప్రశ్న ఇంకొకడికి వెయ్యటమే గాని ఒకసారి గతంలోకి తొంగిచూసి తనని తానే ప్రశ్నించుకోడు ఆ మనిషి. అదే చిత్రం! ఏ విషయాన్నయినా తన కోణం లోంచి తప్ప మరో కోణం లోంచి చూడ టానికి మనిషి అంగీకరించక పోవటమే ఆ వ్యధకి కారణం.

సూర్నార్ణ తడబడుతూ పెద్ద బజారుకి వచ్చాడు.

ఆ బిల్డింగుముందు కార్లు బారులుగా తీర్చి వున్నాయి.

పైన పెద్ద పెద్ద అక్షరాల్లో కొట్టొచ్చినట్టు కన్పిస్తూంది. 'సూర్యనారాయణ & సన్సు.' అన్న బోర్డు. అల్లాగే నిలబడి ఆ బోర్డువంకే పరీక్షగా చూశాడు సూర్నార్ణ, చాలా సేపు.

ఆ అక్షరాల్ని మళ్లీ చదివాడు. అదేమిటి? తను పొరపడ్డాడా?!

'సత్యనారాయణ & సన్సు'! తనకళ్లే తనని ఎంత మోసం చేశాయి?!

తన పెద్ద కొడుకు సత్యనారాయణ వింత పనిచేశాడు! వాడు ఆఖరికి కంపెనీ పేరు కూడా మార్చేశాడా? ఎంత ద్రోహం!

అదేమాట ఒకనాడు లక్షింపతి తన నుద్దేశించి అన్నాడు.

వ్యాపారంలో దొంగ లెక్కలు చూపి ఇంకా లక్షింపతి వాటా క్రింద బాకీంకి లక్షన్నర రూపాయలు కట్టాలని తను నిష్కర్షగా చెప్పినప్పుడు, లక్షింపతి కన్నీళ్ళు పెట్టుకుని కుమిలిపోతూ ఆ మాట అన్నాడు. కాని తను ఏం చలించలేదు.

అది వ్యాపార సరళి.

'ప్రక్కవాడి నెత్తి మీద చెయ్యి మువ్వ పెట్టకపోయావో, ఒకనాటికి వాడే నీ నెత్తిన చెయ్యి పెడతాడు' అన్న సూక్తి తనకి బాగా వంటపట్టింది.

అప్పను. లక్షింపతి తనవల్లనే సర్వ నాశనం అయ్యాడు. అతను నాశనం కాక పోతే తను పైకి రావటం జరిగివుండేది గాదు. అది పద్ధతి.

అయితే తన కొడుకే తనకింత ద్రోహం చెయ్యటమా? వాడికోసం తను ఎంత త్యాగం చేశాడు! రాత్రీ పగలూ అనక సుఖం అంటే ఏమిటో మరిచి తను ఎంత కష్టపడి సంపాదించాడు! ఎవరికోసమని ఇన్ని పాపాలు చేశాడు! ఇన్ని చేసిన తనకి తన కొడుకు ఈ రకంగా ఇచ్చాడు గుర్తింపు?

వేడిగాలి ఈ చెవినుంచి ఆ చెవికి కొడ్తున్నది.



ఎండ మండుతూంది.

కాళ్ళు నిప్పుల్లో పెట్టినట్టు మండు తున్నాయి. పాదాలు బొబ్బలు ఎక్కుతున్నాయి. రోడ్డు ప్రక్కనున్న చెట్టు నీడకి నడిచాడు సూర్నాణ.

ఆ చెట్టు కింద ఒక ముష్టివాడు తాను అడుక్కుని సంపాదించుకున్న రొట్టె ముక్కని కొరికి 'ఆబ'గా తింటున్నాడు.

'అన్నా!' సూర్నాణ దీనంగా పిల్చాడు, అతన్ని.

ముష్టివాడు తలెత్తి ఏంటన్నట్టు చూశాడు.

'ఆకలి మండిపోతా వుంది. నాక్కూడా ఏమన్నా పెట్టవూ?' ఆ అభ్యర్థనలో ఎంతో వేడికోలు. ప్రాణం కొరుకుడు పడి పోతున్నప్పటి జీవుడి బాధ.

'ఆకలి మండిపోతుందా? ఏడవలేక పోయావ్! అంత భరించలేనివాడివి ఎందులో నన్నా పడి చావలేకపోయావ్?' — ఈ మాటలు సూర్నాణ నోటివెంటే ఎన్నో సార్లు వెలువడ్డాయి, ఆ రోజుల్లో. అవి, ఆకలిబాధ అంటే ఏమిటో తెలీనివాడి మాటలు. అయితే ఆ సందర్భం వేరు. ఆ రోజులు గతంలో కలిసిపోయేయున్నాయి!

ముష్టివాడు తన చేతిలోని రొట్టె ముక్క రెండు తుంపులు చేశాడు.

'ఇంద తీసుకో.' అని ఒక ముక్కని సూనాణకి అందించాడు.

ఆ రొట్టెముక్క గబుక్కున అందు కుని గబ గబ తిన్నాడు సున్నాణ. పంపు దగ్గర నీళ్ళు తాగి బ్రేవుమని త్రేన్చాడు. కృతజ్ఞతగా ముష్టివాడివంక చూశాడు.

'అన్నా! ఇకనుంచిక్కడ 'వడగాలి' వచ్చి చంపేస్తది. నేపోతన్నా. నువ్వు కూడా ఏ నీడకయినా జేరుకో.' అని చెప్పి ముష్టి వాడు వెళ్ళిపోయాడు.

సూర్నాణ కాళ్ళు నడవనంటున్నాయి.

అయినా నడవక తప్పదు.

ఎండ మల మల మాడ్చేస్తూంది. మె..బజారుని వదిలిపెట్టి, ఎడమ వైపు సందువెంట నడిచాడు సూర్నాణ.

ఎదురుగా ఎన్నో చెట్లు: అవతలగా గుడిగోపురం కన్పిస్తూంది, తెల్లగా. ఆ గుళ్ళోకి కారు మీద భార్యతోవచ్చి పూజలు చేయించేవాడు సూర్నాణ, అప్పుడు. గుడి ముందు బారులుతీరి కూర్చుని వుండేవాళ్ళు ముష్టివాళ్ళు.

ఆ ముష్టివాళ్ళకి ఏన్నడూ పైసా విదిల్చిన పాపాన పోలేదు. అతనెన్నడూ భార్య ఇవ్వబోతే వద్దని కసురుకునేవాడు.

అక్కడే...

'సరిగా అక్కడే...

ఆ రోజు లక్షింపతి కలిశాడు సూర్నాణని.

కలిసి, 'సూర్నాణా! బాగున్నావా' అని నోరారా పలకరించాడు. తాను సుఖంగానే వున్నాడట. వ్యాపారాలు మానేసి భూములు చూసుకుంటున్నాడట లక్షింపతి. 'ఇవాళే విజయవాడలో మా పెద్దాడి పెళ్ళి. నువ్వు తప్పకుండా రావాలి' అని బలవంతం చేశాడు లక్షింపతి. లక్షింపతి అమాయకుడు!

గుళ్ళో పూజ అయ్యాక భార్యని కార్లో ఇంటికి పంపేసి తను లక్షింపతి కార్లోనే బయలుదేరాడు. కారు జోరుగా పోతూంది. వున్నట్టుండి—ఏదో అయింది. ఏమయిందో సరిగా తెలీదు గాని, కారు బోల్తాపడి

# భారతీయ చిత్రకారులు

రచన, చిత్రాలు: కాలిపు సోమరాజు

## పద్మశ్రీ హుసేన్

శ్రీ మకబూల్ ఫిదా హుసేన్ ఇండోర్ ఆర్ట్స్ కాలేజిలో ఒక సంవత్సరం మాత్రమే శిక్షణ పొందేరు. మిగతా తన జీవితాన్ని ప్రకృతి పాఠశాలలోనే గడిపేరు. ప్రకృతిని వీరు తన మనసులోనే మథించేరు, కేన్వాసు ముద్రించేరు.

సాయంకాలం కాగానే వీరు సైకిల్ ఎక్కుతారు. లాంతరు పుచ్చుకొని ఇండోర్‌లోగల ఒకానొక శూన్య ప్రదేశం లోకి వెళిపోతారు. పగటి సూర్య కాంతిలో చూసిన దృశ్యాల్ని లాంతరు వెలుతురులో రాత్రి చిత్రించేవారు. ఆనాటి నుంచి యీనాటి వరకు వీరు కళా క్షేత్రంలో అనేక మజిలీలు దాటి పోయేరు.

వీరి ప్రథమ చిత్రకళా ప్రదర్శనం 1950 లో బొంబాయిలో జరిగింది. తర్వాత ప్రపంచంలోగల పలు ప్రాంతాలలో వీరి చిత్రకళా ప్రదర్శనలు జరిగేయి. లలితకళా ఎకాడమీలో వీరు సభ్యులు. భారత ప్రభుత్వం వీరిని పద్మశ్రీ బిరుదంతో సత్కరించింది.

సృష్టిలో సహనానికి స్త్రీమూర్తి ప్రతిమూర్తి. నారీమణి నేత్రాలలో దయ, వాత్సల్యము, హృదయంలో ప్రేమ నిండి ఉంటాయి. స్త్రీలో సృజనశక్తి ఉంది. అందుకే వీరి దృష్టిలో మహిళా మణి మహోన్నత స్థానాన్ని పొందింది

స్త్రీ, పాలపురుగు, లాంతరు, గుర్రాలు, మబ్బుల్లోని సూర్యచంద్రులు వీరి చిత్రాలలో ప్రముఖ స్థానం ఆక్రమించుకొన్నాయి.

'త్రూ ది ఐస్ ఆఫ్ ఎ పెయింటర్' అనే ఫిల్మును వీరు నిర్మించేరు, దీనికి బెర్లిన్ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో గొప్ప బహుమతి లభించింది.



# నరవాసన

ప్రక్కనున్న పంట కాల్వలోకి దొర్లిపోయింది. అంతే! అంతే జరిగింది మరి!...

సూర్నాణ కళ్ళు తెరిచాడు. నెత్తి మీద చెట్టు నీడ చల్లగా వుంది.

అతని కళ్ళనిండా నీరు వుంది.

మనిషికి ప్రాణం మీద ఎంత మమకారం! పోయేదాకా ఏదయినా అంతేనేమో!

గుళ్ళో గంటలు గణ గణమని మోగుతున్నాయి.

గుడికి జనం వస్తున్నారు. బుట్టల్లో పళ్ళు, పసుపు, కుంకుమలు, అగరువత్తులూ తెస్తున్నారు. ఆడా, మగా, పిల్లలూ ముసలివాళ్ళూ.

చాల టయిమయింది.

తను ఇక పోవాలి.

మరలా తనూ తన నరకయాతనా! తప్పదు మరి! కర్మ పరిపాకం అనుభవించక తప్పదు గదా! సూర్నాణకి ఒక్కటే కోరిక వుందిప్పుడు. పూర్వం వాసనలు ఇంకా పూర్తిగా పోలేదు. తను పోయేలోగ ఒకసారి తన భార్యని చూడాలి; మాట్లాడాలి. తన కొడుకులూ, కూతుళ్ళూ ఇప్పుడు ఏం చేస్తున్నారు? ఎట్లా వున్నారు? 'తను' ఎట్లా వున్నది? సుఖంగా వుందా? అని అడిగి తెలుసుకోవాలి. జన్మాంతర వాసనలు తనను ఇంకా వొదిలిపెట్టలేదు పూర్తిగా.

అరె!

అక్కడ నిలబడివున్నది ఎవరు?

ఆ కారు ప్రక్కన! ఇద్దరు ఆడమనుషులు. ఆ మనిషి! తన పెద్ద కోడలు సుభద్ర. ఆ రెండో మనిషి తన భార్య రాధ. రాధతో ఏదో చెప్పి కోడలు సుభద్ర పళ్ళబుట్ట తీసుకుని గుడి లోపలికి వెళ్ళిందివిన విసా.

భయం భయంగా దిక్కులు చూస్తూ నిలబడి వుంది. ఆ మొహం అంత దిగులుగా వుందేమిటి?

సూర్నాణ సమధికోత్సాహంతో లేచి గబగబా అటు వెళ్ళాడు.

'రాధా!' కీచుగా పిలిచాడు. ఆ పిలుపులో ఆప్యాయత, ప్రేమ, వేదనాను.

ఆమె అనుమానంగా సూర్నాణని చూసింది. గుచ్చి గుచ్చి చూసింది పదే పదే.

'నన్ను గుర్తించలేదా రాధా? నేను, నీ భర్త సూర్యనారాయణని.'

'మీరా!? మీరు...మీరు ఎట్లా వచ్చారు?' రాధ తత్తరపడింది.

'అవును. నేనే రాధా. నిన్ను చూడా... పించి యముడి దగ్గర పర్మిషన్ తీసుకు వొచ్చాను. చెప్పు. ఎట్లా వున్నావు? సుఖంగా వున్నావా? మన కొడుకులు మంచిగా చూసుకుంటున్నారా? నిన్ను. అమ్మాయిలెట్లా వున్నారు?'

ప్రశ్నల మీద ప్రశ్నలు. రాధ కళ్ళు వర్షించాయి. పమిట చెంగుతో కళ్ళొత్తుకుని వెక్కిళ్ళు పెట్టింది.

'చెప్పు రాధా. మళ్ళా ఎవరన్నా వస్తారు. త్వరగా చెప్పు.'

'ఏం చెప్పమంటారు?'

'అదే. నువ్వు సుఖంగా వున్నావా? పెద్దాడు నిన్ను ప్రేమగా చూసుకుంటాడా? మిగతా పిల్లలు—మనవాళ్ళు అంతా ఎట్లా వున్నారు?' అన్నాడు. రాధ భయంగా చూసి నోరు పెగల్చుకుని అంది. 'పెద్దాడు మీరు పోయాక పూర్తిగా మారిపోయాడు. ఇప్పుడంతా పెద్దకోడలుదే పెత్తనం. వాడు అది గీసిన గీటు దాటడు. ఇంత బ్రతుకు బ్రతికి నేను కోడలు దగ్గర ఒదిగి నిలబడి 'అత్తరికం' అనుభవిస్తున్నాను. మన పెద్దాడు మిగతావాళ్ళని అన్యాయం చేశాడు. వాళ్ళు పనికిరానివాళ్ళుగా తయారయి దేశాలు పట్టి పోయారు. ఆడపిల్లలు అత్తారిళ్ళలో అగచాట్లు పడుతున్నారు. వీడు వాళ్ళ సంగతి పట్టించుకోడు. కట్నాల దగ్గర గొడవ లుండిపోయేయి. వాడికేం తక్కువని? అయినా సరే. పెద్దాడిది అదొక ధోరణి. వాడు పూర్తిగా మారిపోయాడు. ఎంతసేపూ తన పెళ్ళాం, తనూ, తన పిల్లలూ. ఇదే వాడి ధోరణి. నేను తిన్నానో లేదో అని కూడా అడగటానికి వాడికి ఏనాడూ నోరు రాదు. పెద్దాడు నన్ను చూస్తే చాలు చిటపట లాడ్తాడు. అంతా నా ఖర్మ! మీకేం? మహారాజులు. చీకూ చింతా లేకుండా మీ దార్ని మీరు పోయారు. ఏమయినా మళ్ళీ మీరు వచ్చారు. నాకు కొండంత బలం వచ్చింది. అదే నేను...'

చెప్తూ చెప్తూన్న రాధమ్మ అనుమానం వచ్చి ప్రక్కకి తిరిగి చూసింది.

అక్కడ సూర్నాణ లేడు.

వాసనా బంధం పటాపంచలయిపోయిన సూర్నాణ ఆత్మ ఆ నరకియ మలోకపుదారిని సగం అధిగమించి ముందుకు దూకుతూంది.

గుండెలు జలదరించిన రాధమ్మ అక్కడ నిలబడలేక గబ గబా కోడలుకోసం గుళ్ళోకి నడిచింది, కాళ్ళు గజగజ వణకుతూ వుండగా.







### జ రి గి న క థ

విద్యార్థి బియ్యే పాసయ్యాడు. తల్లికి పై చదువు మీద ఇష్టం లేదు. అక్కడితో ఆపేసి పెళ్ళి చేసుకుని ఇంటిపట్టున వుండమంది. కాని, విద్యార్థి ఎమ్‌ఏలో చేరాలని పట్టుపట్టాడు. రైలెక్కి గుంటూరు వచ్చేశాడు. ఎమ్‌ఏకి ఫీజు కట్టేశాడు. అక్కడే అతని స్నేహితుడు లోకన్‌బాబు కనిపించాడు. తర్వాత మావయ్య గారింటికి వెళ్ళాడు. లక్ష్మి అతని మరదలు. లక్ష్మి అంటే అతనికి ఇష్టమే కాని, తను ఎవరినో ప్రేమిస్తున్నట్టు తెలియ చెప్పింది. విద్యార్థి చాలా విరక్తి చెందాడు.

# 3

ఆషాఢమేఘాలు తొలకరి జల్లులు కురిపించి చలచల్లగా జారుకున్నాయి... భోజనానికి రమ్మని మావయ్య కబురుచేసే దాకా అలా ఆలోచిస్తూనే వుండిపొయ్యాడు.

భోజనాలదగ్గర..మేనమామకూ,తనకూ, లక్ష్మికి వడ్డిస్తోంది అత్తగారు... అప్పుడే అన్నాడు విద్యార్థి. 'రేపొద్దున బస్‌కు వెళ్తున్నాను మావయ్యా...' అని.

'వెళ్తావూ?...అదేమిట్రా...' అన్నం కలుపుకుంటున్నవారల్లా ఆగిపొయ్యారాయన ఆశ్చర్యంతో, 'అన్నివిషయాలూ మాట్లాడుకుని ఏర్పాట్లవీ చూసుకుని వెళ్ళవూ ?' అన్నాడు.

లక్ష్మి గతుక్కుమన్నట్లు మొహంపెట్టి నోట్లో పెట్టుకోబోతున్న ముద్ద కంచంలో వేసింది.

'ఏర్పాట్లేమిటి మావయ్యా?' ఎరగనట్లే అడిగాడు విద్యార్థి.

'ఏర్పాట్లేమిటి!... ఏరోయి నాకంటె పెద్ద లిటిగెంటుగా మాట్లాడుతున్నావే... అమ్మనీ విన్నా బయలుదేరి రమ్మని రాశానుగదరా...ఈ శ్రావణంలో అది కాస్తా అయిందనిపిస్తే.'

కొన్ని నిముషాలపాటు ఎవ్వరూ మాట్లాడలేదు. తర్వాత మెల్లిగా.

'ఇప్పుడు దానికి తొందరేమొచ్చిందిలే మావయ్యా...లక్ష్మిని కాలేజిలో చేర్పించాగా... అక్కడ చదువుతున్న ఆ చదువేదో పూర్తికాని పాపం... మరో రెండేళ్ళు పొయ్యాక చూసుకోవచ్చు' అన్నాడు లక్ష్మి వంక హేళనగా చూస్తూ.

లక్ష్మి గ్లాసుడు నీళ్ళు ఎత్తి గటగటా తాగేసింది. లక్ష్మి ముఖంమీద చిరుచెమటలు పట్టినట్లు... పక్కచూపులు చూస్తున్న విద్యార్థి మాత్రమే గమనించాడు.

ధనంజయరావుగారి కివేమీ పట్టలేదు. ఆయన భోజనం కానిస్తూనే పెద్దపెట్టున నవ్వారు. 'అదికాదురా రమేష్!' ఆయన విద్యార్థిని అలాగే పిలుస్తారు. ఆయనకు ఎవరినైనా సరే లక్ష్మి పేరుకలవని పేరుతో పిలవడం ఇష్టంలేదు. అందుకే పెళ్ళి కాగానే ఆయన భార్య సుబ్బమ్మ కాస్తా సుబ్బలక్ష్మి అయింది... కూతురు పేరు జయలక్ష్మి...కొడుకు శ్రీకాంత్... ఆయన ఇల్లు పేరు లక్ష్మీనిలయం... ఆయన రైసుమిల్లు పేరు 'లక్ష్మీ రైసుమిల్లు' చివరికి ఆయన గేదెలకుకూడా ఆదిలక్ష్మి మహాలక్ష్మిలాంటి పేర్లు పెట్టుకున్నారు ... అందుకనే ఆయన విద్యార్థి పుట్టినప్పుడు వాళ్ళ నాన్నగారు 'ఈశ్వర చంద్ర విద్యార్థి' అని పేరు పెడతామంటే, కాదని 'రమేష్ చంద్ర విద్యార్థి' అని పెట్టించారు.

ఇప్పుడు ముద్ద నోట్లో పెట్టుకుని నవ్వడంవల్ల ఆయనకు పొలమారింది. మంచినీళ్ళు తాగి కాస్త సర్దుకున్నాక మళ్ళీ అన్నారాయన.

'నీ చదువింకా పూర్తికాలేదుకదా...అదీ కాక అందరిలానే నువ్వూ ఘనంగా నా భార్య బి. ఏ. చదివిందని చెప్పుకోవచ్చుగదా... అని చేర్పించానురా కాలేజీలో... బి. ఎ. అంటే పాసయిందా...చదివిందా ... చేరిందా ... అని ఎవ్వరూ ప్రశ్నలువెయ్యరు గదరా ... అంతే గానీ...యీవిడ చదివి ఏదో వెలగబెడ్తుందనా...ఏదో ఆ లెక్కలూ అవీ చూసిపెట్టి కాస్త సాయపడ్తుందనిగానీ ... అందుకే ఎకనామిక్స్ గ్రూపు యిప్పించాను' అన్నారాయన గర్వంగా.

'చేర్పించడం చాలా మంచి పనే చేశారు. అయినా ఎటూ చేర్చారుకదా...ఆ డిగ్రీ తీసుకోనివ్వండి... ఈ లోపల నా చదువు కూడా పూర్తవుతుంది' అని నెమ్మదిగా తన చదువు విషయం బయటపెట్టాడు విద్యార్థి.

'చదువా! ... అదేమిట్రా బి. ఏ. పాసయ్యావని రాసిందిగా మీ అమ్మ ? ...' భోజనంచెయ్యడం ఆపేసి ఆశ్చర్యంగా అడిగారాయన.

'బి. ఎ. అయింది. ఎం. ఏ.లో చేరాను.'

అలా అంటున్నప్పుడు కొంచెం గర్వం తొంగి చూసింది అతడి చూపులో. పక్క నుండి లక్ష్మివైపు చూశాడు. ఆ చూపులో, 'చూశావా నేను దేబిరించడానికి రాలేదు. తిరస్కరించడానికే వచ్చాను.' అన్న భావం వుంది.

లక్ష్మి ముఖంలో యింతదాకా చోటు చేసుకున్న దిగులూ భయంలాంటి భావాలు పోయి, 'అమ్మయ్య' అన్న భావం గోచరించింది.

ధనంజయరావుగారు మాత్రం ఇందు ఆశ్చర్యపొయ్యారు. తర్వాత నచ్చచెప్పే ధోరణిలో...

'ఎం. ఎ. లో చేరావ్! ... ఏందుకొచ్చిన చదువుర్రా యివి రమేష్...హాయిగా పెళ్ళి చేసుకుని నీడపట్టున వుండి సుఖపడక నే... నేనేమో ఒక టూరింగ్ టాకీసు కూడా కొనబోతున్నాను — ఒక రైసు మిల్లు, యింకో రైసు టాకీసు కాంట్రాక్టులు, యివన్నీ ఒక్కడ్నీ చూసుకోలేకపోతున్నాను. పైగా యీ మధ్య కో—ఆప్ మెంబరుగా

కూడా వీలక్ష్యయ్యానా ... వూపిరి సలపడం లేదు...అసలే నా ఆరోగ్యంకూడా బాగుంటం లేదు.'

'హెంట్లో బావుండనప్పుడు యిన్ని బాదరబందీలు నెత్తి మీద వేసుకోడం వెందుకు మావయ్యా?...హాయిగా వున్నదేదో పెట్టుకుని నిశ్చింతగా వుండక?...'

'ఓయి పిచ్చి సన్నాసీ !...నీకింకా లోకం పోకడ తెలియదురా...ధనం మూల మిదం జగత్...ఈ రోజుల్లో డబ్బు లేనివాడు దమ్మిడీకి కొరగాడు...సంఘం, యిరుగూ—పొరుగూ, చుట్టాలూ పక్కాలూ, చివరికి కట్టుకున్న పెళ్ళాం, కడుపున పుట్టిన బిడ్డలు కూడా డబ్బుంటేనేనోయి గౌరవించేది!...అది లేనివాడు అందరికీ లోకువే. నా మాట విని, ఆ మిల్లు, టూరింగ్ టాకీస్ రిపేర్లు వగైరాలు నువ్వు చూసుకుంటే ఆ కంట్రాక్టులు వగైరా నేను చూసుకుంటాను. ఆ మేడ రెండు గదుల్లో హాయిగా చిలకాగోరింకల్లా మీరిద్దరూ వుండచ్చు. అంతగా 'గెస్టు హౌస్' కావా లంటే వేరుగా మరో రెండు గదులు వేయిస్తాలే.'

నిజానికి మేడ మీద రెండు గదులూ కూతురికీ కొడుక్కూ అని కేటాయించారు గాని అందులో వుండేది ఎప్పుడూ అతిథులే. ఆ వూరికి వచ్చిన చిన్నా పెద్దా రాజకీయ నాయకులు, తర తమ భేదం లేకుండా ఛోటా బడా వుద్యోగులు, ఎవరు వచ్చినా సరే ... వాళ్ళతో తనకు పని తగలచ్చుని ఆయన కేమాత్రం అనిపించినా, వాళ్ళనా 'గెస్టురూమ్స్'లోనే దింపుతారు. వాళ్ళకు కావల్సిన 'అన్ని సదుపాయాలూ' చిరునవ్వుతో అమరుస్తారు. ఆ మాటకొస్తే ధనంజయరావుగార్ని లోభి అనడానికి వీల్లేదు. పెద్ద చేపను పట్టడానికి ఎన్ని చిన్న చేపలు విరవెయ్యాల్సి వచ్చినా ఆయన వెనుకాడరు. ఇంతదాకా ఒక్కపూట ఆయన ఆతిథ్యం స్వీకరించినవారెవ్వరూ, ఆయనకు ఏదో విధంగా వేలమీద లాభం చేకూర్చనివాళ్ళు లేరు.

'అయితే మావయ్యా నన్నిక్కడే వుండ మంటున్నావ్ గదా...అమ్మా, తమ్ముడూ, చెల్లెలూ వాళ్ళ సంగతి చూసేదెవరు ?' మరో పాయింట్ తీశాడు విద్యార్థి.

ఆ మాటకు ఆయన హాయిగా ఘల్లు ఘల్లున నవ్వాడు. ఆయన అలా నవ్వినప్పుడు లక్ష్మిదేవి గజ్జలు ఘల్లు ఘల్లు మంటూ ఆ యింట్లో తిరుగుతున్నట్లనిపిస్తుంది... ఆయనది పచ్చగా దబ్బపండు...కాదు... కాదు ... బంగారపు ఛాయ ... మూర్తీభవించిన లక్ష్మిరూపు ఆయన ... అసలే ఆకర్షణీయమైన విగ్రహం, అలా నవ్వుతున్నప్పుడు చూస్తే అలా చూస్తూనే వుండి



కోవాలనిపిస్తుంది ఏటువంటివారికైనా ...

క్షణంపాటు విద్యార్థి కూడా ఆ ఆకర్షణలో పడ్డాడు... వెధవ చదువు... ఇంతలా ఆప్యాయంగా చూసే మేనమామ మనసు నొప్పించి, లక్ష్మి తాండవమాడే ఈ యింటిని వద్దని ఎందుకు తనకీ పంతం అనిపించింది.

ధనంజయరావుగారు కాసిని మంచినీళ్ళు తాగారు. తర్వాత, 'ఏమిటో అనుకున్నాను గాని నువ్వా ఘటికుడవే. అన్నీ నాచేతే క్విట్ చేయించాలనుకుంటున్నావన్నమాట. అది కాదోయ్. మీనాన్న పొయ్యాక ఫామిలీ పెన్షన్ ఏదో వచ్చినట్టుందిగా ... ఏడువేలో ఏమో బాంకిలో వుందన్నదే మీ అమ్మ ... అదిపెట్టి మీ చెల్లెలు పెళ్ళి అయిందనిపిస్తే యిక అమ్మా తమ్ముడూ అంటావ్ ... ఆ వూళ్ళోనేవుండి పొలం పుట్రా చూసుకున్నా సరే...లేదా ఈయింటి ఒడఒడుమగా దాని స్థానం దాని కుండనే వుంది' అన్నారు.

'అంటే యింత చదువూ చదివి నన్ను యిల్లరికపు టల్లుడుగా వుండిపొమ్మంటారు అన్నమాట?' కొంచెం తీవ్రంగానే అడిగాడు విద్యార్థి.

'ఇల్లరికపు టల్లుడేమిటోయి మేనమామదగ్గర?... నీకు అంత అభిమానంగా వుంటే, ఆ రెండేళ్ళు చదువూ వెలగ బెట్టాక వస్తుందే జీతం నెలకు రెండొందలో మూడొందలో ... అది నేనే పడేస్తాను' అన్నారాయన కోపంగా. అలా అంటున్నప్పుడు ఆయన ముఖం జేవురించి ఎరుపురంగులో వుంది. నాసికా పుటాలు పెద్దవయ్యాయి. తన మాటంటే ఆవూరూ వాడా అందరికీ హడలు. ఏదో కుర్రాడు గదా అని మంచిగా చెబుతుంటే తన్నే ఎదిరిస్తాడా?... అనిపించిందాయనకు. అది ఆయన అహానికో సవాలుగా తోచింది.

'నువ్వు దయ తల్చి రెండొందలో మూడొందలో పడెయ్యాల్సిన పనేంలేదు మావయ్యా... చేరినవాడ్ని ఎలాగూ చేరాను. అది పూర్తిచేసి తీరుతాను అంతదాకా అగ్గదల్చుకుంటే ఆగండి ... లేదా మీ యిష్టం' అనేసి యికతను చెప్పవలసింది ఏమీ లేదన్నట్టు మజ్జిగైనా పోసుకోకుండా కంచంలో చెయ్యి కడిగేసి లేచాడు విద్యార్థి.

# విద్యార్థి

'మొగాడయ్యాడు మొగాడు?... రెండే ళ్ళాగలేడు!... ఈ మొనగాడు తప్పించి నా కూతురికి రెండేళ్ళదాకా మొగుడే దొరకడు కాబోలు.' కోపంతో బుసలుకొట్టా రాయన. తింటున్న కంచంలో చెయ్యి కడిగేసి లేచారు ఆయనకూడా.

ఇంతదాకా పెదవి కదపని సుబ్బలక్షమ్మగారు, 'పిలిచి అందలమెక్కిస్తా మంటే అబ్బే గీత అందరికీ వుండద్దూ?' స్వగతంలా పైకే అనుకున్నారు. ఇంతదాకా యితగాడు లగ్గం పెట్టుకోడానికే వచ్చాడనుకొని అమర్చిన సౌకర్యాలన్నీ వృధాగా చేశానే అనిపించిందావిడకు.

లక్ష్మి ఒక్కతే తనకేమీ పట్టనట్టు భోజనం కానిచ్చింది ఆరాత్రి.

మర్నాడు పొద్దుటే ఫస్టు బస్సుకి బయలుదేరిన విద్యార్థి, 'వెళ్ళొస్తా'నని మేనమామతో చెప్పినప్పుడు, 'వెళ్ళాలనే నువ్వు నిశ్చయించుకుంటే, మళ్ళీ వస్తా వనే ఆశవుండదని తెలుసుకుని మరీ వెళ్ళు' అన్నారాయన.

మేడమెట్లమీద నిలబడి, కొయ్య బొమ్మలా చూస్తున్న లక్ష్మివైపు కన్నెత్తి కూడా చూడకుండా, గిరుక్కున తిరిగి వచ్చేసిన విద్యార్థికి అంతా అగమ్యగోచరంగా వుంది. ఇదంతా తల్లితో చెప్పక తప్పదు. అయితే ఎంతవరకూ తల్లికి చెప్పొచ్చు, అదీ ఆవిడకు చెప్పడమెలా అన్నదే అతడికో పెద్దసమస్య అయింది. అందుకే యింటికి తిరిగి వచ్చిన రెండుమూడు రోజులదాకా ఏమీ చెప్పలేక పొయ్యాడు.

మేనమామ దగ్గరకు వెళ్ళొచ్చినవాడు లగ్గాల సంగతి, యితర విషయాల సంగతీ చెప్పక ముభావంగావుంటే విద్యార్థి తల్లి ధనమ్మగారికి ఏం జరిగిందో నన్న కుతూహలం ఎక్కువైంది. కొడుకును తనంత తాను పిల్చి అడగడానికి నామోషీ అనిపించిందావిడకు. ఇవ్వాళ కాకపోతే రేపు తనకు చెప్పక ఎక్కడకు పోతాడులే అనుకున్నా మనసుండబట్టక, ఒకటి రెండు సార్లు విషయం ప్రస్తావించబోగా కొడుకు తప్పించుకు తిరగడం చూస్తే ఆవిడకు అనుమానం కలిగింది.

ధనమ్మగార్ని గురించి చెప్పాలంటే ఆవిడ అచ్చంగా ధనంజయరావుగారి చెల్లెలే... అయితే ఆవిడకూ ఆయనకూ కొన్ని తేడాలున్నాయి. ఆయనకు డబ్బు కావాలి. ఆ డబ్బు ఒకట్లు పదుల్లై, పదులు వందల్లై, అలా అలా మహా వట వృక్షంలా పెరిగిపోయి, ఆ చల్లని కీర్తి ప్రతిష్ఠల నీడలో మరికాస్త డబ్బు చేసుకోడం ఆయన వుద్దేశం. అయితే ధనమ్మగారి విషయంవేరు. ఆవిడకూ చేతిలో డబ్బు గలగలాడుతూ వుండాలి. ఆ డబ్బు సంపాదించడానికి ఎవరెంత కష్టపడనీ, ఎవరెన్ని అక్రమాలు చెయ్యనీ అది ఆవిడకు అనవసరం. ఒక్కమాటలో చెప్పాలంటే—'ఆవిడ చేతి కెముకలేదు.', 'పెట్టుపోతలు చెప్పుకోవాలంటే ధనమ్మగారి తర్వాతే యింకెవరన్నా.' లాంటి పొగడ్తలు సంపాదించుకోడానికి వుపయోగపడే వాపకర ణాలే యింట్లో మిగతావారంతా ఆవిడకు. ...ఆవిడ భర్త పెద్దవుద్యోగం చేస్తూ, కుడిచేత్తో ఎడమచేత్తో గూడా సంపాదించి. చివరికి పక్షవాతంతో మంచాన పడ్డప్పుడు... 'ఎంతమంది అమాయకుల వుసురు పోసుకున్నానో వూరికే పోతుందా? ...పోతే అదేదో నేనే అనుభవిస్తున్నాను. నా బిడ్డలకు తగలకుండా వుంటే అంతే చాలు...' అని ఆయన బాధపడుతున్న క్షణాన కూడా ఆవిడెప్పుడూ పశ్చాత్తాప పడలేదు.

అలా రోజులు గడుస్తున్నాయి. తెల్లవారితే ఆగస్టు ఒకటి కాలేజి తెరుస్తారనగా అసలు విషయం బయటపెట్టక తప్పలేదు విద్యార్థికి... అయితే అదికూడా లక్ష్మితో మాట్లాడిన సంగతి, ఆ అమ్మాయి పరోక్షంగా తనను తిరస్కరించిన విషయం చెప్పడానికి మనస్కరించక, తను కాలేజీ ఫీజు కట్టేసిన విషయం, చదువయ్యేదాకా ఆగమని మావయ్యతో చెబితే ఆయన మండిపడి కూతురికి వేరే సంబంధం చూసుకుంటా ననడం వరకు మాత్రమే చెప్పాడు.

అది విన్న ధనమ్మగారు వుగ్రురాలయింది. ఆవిడమాట ఆవిడ భర్తే ఏనాడూ కాదనలేదు... కొడుక్కు మాత్రం మాట ఖాతరులేక పోయిందేనన్న కోపమూ బాధా కూడా కలిగాయి ఆవిడకు... కానీ విషయం చెయ్యిదాటి పోయింది. తను




# వెంటనే కరగగల ఆహార పదార్థమైన పానీయం వీవా

వీవా పుష్టిని యిస్తుంది. వీవా చాలా రుచికరమైనది, త్వరగా కరుగుతుంది అధిక శక్తిని యిస్తుంది పెద్దలకు నచ్చుతుంది వీవా. పిల్లలకు ఎంతో యిష్టం వీవా

ఎందువలనంటే వీవాలో శుద్ధమైన క్రీమ్‌గల పాలే కాకుండా యింకా ఎన్నో ఉన్నాయి వీవాలో ఉన్న ప్రొటీనులు మీకు శక్తిని యిస్తాయి వీవాలోని కార్బోహైడ్రేటులు మీకు రోజంతా పని చెయ్యటానికి కావలసిన స్ఫూర్తిని యిస్తాయి వీవా గోధుమలు మరియు మాల్టెడ్ బార్లీతో పరిపూర్ణమైనది కావటం వలన, వీవా అన్నిటికన్న రుచికరమైన, బలవర్ధకమైన ఆహార పానీయం

వీవా ఆధునిక పద్ధతులలో తయారు చేయబడినది. అందుకే దీనిలోని బలవర్ధకమైన పదార్థాలు ఏమాత్రం నష్టంకావు. ఇది త్వరగా కరుగుతుంది కూడాను. ఈవాళే మీ యింట్లోవాళ్ళ కోసం ఒక బాటిల్ వీవా తీసుకురండి. నూతన శక్తినీ, స్ఫూర్తినీ పొందండి

ఎక్కువ రుచికోసం, అధిక శక్తి కోసం ఆధునికమైన **వీవా**

ULKA-V6-TEL

చెప్పగలిగినంతా ముందే చెప్పింది. యిక వాళ్ళ గుర్నే పిలిచి 'వీడినోట యింత గడ్డి పెట్టించాలి!' అనుకున్నదావిడ.

అదేవిధంగా వూళ్ళో పెద్దల్ని నలుగుర్నీ పిల్చుకొచ్చి చెప్పించింది. అందరూ కలిసి విన్నివిధాల నచ్చచెప్పారు. బాంకిలో వున్న డబ్బు పెట్టి చదువు ..అంటే చాలా కష్టనష్టాలున్నాయి చెల్లెలికి పెళ్ళి చెయ్యాలి... చదువు అంటే మాటలతో అయ్యేపనికాదు. వేళకావాలి. మేనమామ కివ్వాల్సిన అప్పు యింకా అలాగేవుంది. తమ్ముడు చూస్తే చిన్నవాడు...పంటలమీద వచ్చేడబ్బు. అవీ అన్నీ సక్రమంగా వుండి పంటలు బాగా పండితే, నాట్లకూ కోతలకూ నూర్పిళ్ళకూ యింకా 'బ్లాకు'లో కొనాల్సిన ఎరువులకూ పోగా మిగిలింది. యింటిఖర్చుకు కూడా సరిగా చాలదు. అంతేకాదు వున్న పెద్ద దిక్కు ఒక్కడూ మేనమామ...ఆయన్ను కూడా విరోధం చేసుకుంటే చెల్లెలికి పెళ్ళి సంబంధం తెచ్చేదెవరు?... ఈ రోజుల్లో కన్నతండ్రి వుండి కాలికి బలపం కట్టుకు తిరిగితేనే ఆడపిల్ల పెళ్ళిచెయ్యడం కష్టంగా వుంది. ఇక ఎన్నడూ గుమ్మం దాటి ఎరగని తల్లి. లోకం పోకడ తెలియని



వాడు వీళ్ళ సంబంధం చూసి పెళ్ళి చెయ్యడమంటే మాటలా?... అన్నిటికంటే అతడి వుద్యోగం మాటేమిటి?... ఈ రోజుల్లో పెద్ద పెద్ద రికమండేషన్లు లేందే వుద్యోగాలు రావటంలేదు. అటువంటప్పుడు కల్పవృక్షంలాంటి మేనమామ నీడ వదులుకుంటే అతడే అన్నిందాలా నష్టపడతాడు.

ఇదీ వాళ్ళందరూ చెప్పిన సారాంశం. విద్యార్థికి తను ముళ్ళకంచెలో చిక్కుకు పోయినట్లు అనిపిస్తోంది. తప్పుచేశానేమో నన్న భావంకూడా కలుగసాగింది కానీ... తనకు మనసివ్వనిపిల్లను ఏలుకోడం ఎలా? ...దానికి తోడు మావయ్య అంత అహంభావంతో మాట్లాడాడు. ఇక ఆయన దగ్గరకు ఏమొహం పెట్టుకుని తను పోగలడు?... ఒకవేళ తల్లిని పంపించినా తను చులకన కాకుండా వుంటాడా?... యిలా ద్వంద్వంలో పడిపోయ్యాడు...

ఆలోచనలో పడిపోయిన విద్యార్థిని చూసి తాము నచ్చచెప్పింది వూరికే పోతే




దన్న ధీమా వచ్చింది ఆ వూరిపెద్దల్లో... అందుకే వాళ్ళు మరోమాట కూడా జోడించారు. అదేమిటంటే...ఇప్పుడు చదువు మొదలెట్టినా అది ఎలాగూ పూర్తి కాదు... అతడికి చదువు ప్రాప్తంలేదు. ప్రాప్తంలేని దానికి ప్రాకులాడ్డం శుద్ధ తెలివితక్కువ. ఏటికి ఎదురీదడం కంటె ఏటివాలున సాగిపోడం మంచిది. అంటూ సలహా యిచ్చారు.

కానీ యీ సలహా చాలా విపరీత పరిణామం తీసుకొచ్చింది. అతడికి వెంటనే సత్యం చెప్పినమాటలు జ్ఞాపకం వచ్చాయి... 'ఎందుకు ప్రాప్తంలేదో చూడాల'నిపించింది. అందుకే రాత్రి పదిగంటలదాకా వాళ్ళు చెప్పిన నయబోధలన్నీ తలవొత్తుకుండా బుద్ధిగా విన్నవిద్యార్థి వాళ్ళటు గుమ్మం దాటీ దాటగానే లేచి చకచకా బట్టలు సర్దుకోసాగాడు...అది చూసిన ధనమ్మగారు మండిపడింది.

'నువ్వసలు నా కొడుకువే కావు పొమ్మంది.'

అయితే చెల్లెలు ఆశ వ్యాత్రం అతడి గదిలోకివచ్చి. 'అన్నయ్యా నే సర్దుతాలే నీ బట్టలు' అన్నప్పుడు విద్యార్థి కళ్ళు చెమర్చాయి. ఆ అమ్మాయిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు

మర్నాడుదయం మొదటి బస్సుకి బయలుదేరుతూ ధనమ్మగారితో చెప్పినప్పుడు ఆవిడ తన్ను కానట్టే వూరుకుంది. అతడుకూడా గిరుక్కున తిరిగి వెళ్ళి పోతున్నప్పుడు. 'ఇంతవుంది పెద్దలు కాదంటే... ఏదో సాధిస్తాడట పెద్ద ... 'హా...మొండితనం...కాదు అహంకారం...' అనుకుంది ... అయితే 'బాంకి ఎకౌంటు' అతడి పేరనయితే తీసేటప్పుడు చెరికను కోడం పొరబాటయింది! ... అని మాత్రం అనుకుంది.

విద్యార్థి గుంటూరు చేరగానే సరాసరి సత్యం గదికే వెళ్ళి పెట్టె బెడ్డింగ్ అక్కడే పడేసి, వాళ్ళతోబాటు హోటల్లో రెండు మెతుకులు తిని సిటీబస్‌కోసం పడిగాపులు పడి కూచుంటే ఎప్పటికో దయతలచిన వాహనరాజం, మరెప్పటికో కాలేజికి చేర్చే, అప్పటికే స్పెషలాఫీసరు 'మీనాక్షిసుందరం' గారి ప్రారంభోపన్యాసం అయిపోయి ఎవరి క్లాసుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయ్యారు.

విద్యార్థి రూమ్ నెంబరు చూసుకొని క్లాసులోకి వెళ్ళేసరికి లెక్చరరు క్లాస్ తీసుకుంటున్నారు.

'మే ఐ కమిన్ సర్?'

'ఎస్...కమిన్ ప్లీజ్.'

క్లాసులో కదుగు పెడుతుంటే విద్యార్థి అడుగులు తడబడ్డాయి. ఈ వెయ్యబోతున్న అడుగు తనను ఎటు తీసుకు వెళుతుందో... అనుకున్నాడు.

మధ్యాహ్నం పన్నెండున్నరకు యింటికి చేరుకున్నారు వాళ్ళు. కాస్సేపు ముగ్గురూ విశ్రాంతి తీసుకున్నారు. బయట ఎండిన ఎడారిలాంటి మానవజీవితంలో ఆశల జల్లులు పడ్డట్టు, ఆశానిరాశలకు సంధి కుదిరినట్టు, ఒకవైపు ఎండ కాస్తుంటే మరోవైపు చినుకులు పడుతున్నాయి.

సత్యం వాళ్ళది ఒక ఒంటరుగది ... ఆ యిల్లు చాలా పాతది... చుట్టూ కాంపౌండ్ కూడా లేదు. గోడలు వుప్పు రిసినట్టున్నాయి. సున్నపు పెళ్ళలు రాలిపోతున్నాయి. అదే మున్నూరు రూపాయలు ... 'విద్యార్థికి కూడా బ్రాడీపేటలోనే గది చూడాలని నిశ్చయించుకున్నారు. పట్టాభిపురం వూరికి చాలా దూరం ... అరండల్ పేట అయితే సిటీ బస్‌కు దూరమవుతుంది. అందుకని బస్ సౌకర్యంకోసం విద్యార్థికికూడా బ్రాడీపేటలోనే అయితే బాగుంటుందనిపించింది.

మూడు గంటలు కాగానే ముగ్గురూ లేచి టాయిలెట్ అయి దగ్గర్లోవున్న హోటల్లో కాఫీ తీసుకున్నారు. ఇక గది వేటకు బయలుదేరారు. స్టూడెంట్సుకు యివ్వమని కొందరంటే అప్పుడే 'అడ్వాన్సు' యిచ్చి వెళ్ళారన్నారు మరికొందరు. రెండు మూడుగదులు చూస్తే అవి వాళ్ళకు నచ్చలేదు. సాయంత్రందాకా తిరిగి అటు నుంచి హోటలుకువెళ్ళి భోజనంచేసి, దగ్గర్లోవున్న పిక్చరుకువెళ్ళి రాత్రి పదిన్నరకు గదికి చేరుకొన్నారు.

మర్నాడు...యధాప్రకారం భోజనాదికాలు ముగించుకుని పదకొండు గంటలకు ప్రారంభించే కాలేజికి తొమ్మిదిన్నర గంటలకు బయలుదేరి ఆరోజు కలెక్టరేట్ దగ్గరే బస్సు ఎక్కాలనుకుంటే అది కాస్తా అందలేదు...ఇక ఆఫీసర్స్ క్లబ్ పక్క రోడ్డున పోలీసు యిన్‌స్పెక్టరు బంగళాదగ్గరకు చేరు

కునేసరికి అక్కడకూడా దొరకలేదు బస్. అక్కడ దరిదాపు గంటసేపు నిలబడ్డారు. అక్కడే మరికొంతమందికూడా బస్‌కోసం పడిగాపులు పడివున్నారు. సత్యంకు తెలిసిన

## విద్యార్థి

కుర్రాడు కనబడితే నలుగురూ కబుర్లలో పడ్డారు.

"కాలేజినీ, నాగార్జున యూనివర్శిటీగా విజయపురిలో పెట్టాలనే ప్రపోజల్‌కి వుండి టగా?' అన్నాడతడు.

'ఆ...అలా పెట్టినా బాగుండిపోను ...' వెధవ బస్సుకోసం పడిగాపులు పడలేక చస్తున్నాం.' అన్నాడు విసుగుపుట్టిన విద్యార్థి.

'గురూగారూ. నాలుగు ఫర్లాంగుల దూరంలోవున్న కాలేజి, అడ్డదారిన సైకిల్ మీదపోతే అరగంటలో చేరే కాలేజికి బస్సు మీదకోపంతో ఎక్కడికో పంపాలంటారేమిటండీ?... ఇక్కడయితే యిటు తెనాలి, బెజవాడలాంటి వూళ్ళనుండి సీజనుపీద తిరిగినా తిరగచ్చు... అందుకే దీన్ని యూనివర్శిటీగామార్చినా యిక్కడ గుంటూరులోనే వుంటే ఎక్కువమందికి వుపయోగంగా వుంటుంది!' అన్నాడు లోకన్‌బాబు.

ఇలా మాటల మధ్య 'విద్యార్థి' గది ప్రస్తావన వచ్చింది...సత్యం స్నేహితుడు గుంటూరువాడే .. అతడు తనకు తెలిసిన వాళ్ళింట్లో ఒక గదివుందని అందులో ఒక్కడే మెడిసిన్ చదివే కుర్రాడుంటున్నాడని అతడ్ని అడిగి చూద్దామని చెప్పగానే విద్యార్థికి కొంత ప్రాణంవచ్చింది.

మధ్యాహ్నం కాలేజినుండి రాగానే ఏకా ఎకి బయలుదేరారు. అతను కాలేజీకి వెళ్ళిపోయ్యుంటాడేమోనని వాళ్ళు భయపడుతూ వెళ్ళినా అతడు హాయిగా నిద్రపోతున్నాడు వాళ్ళు వెళ్ళేసరికి.

ఆగది మేడమీద గది...ఒకే ఒక్క గది ... దానికి చిన్నపంచ. ఇంటి వాళ్ళతో ప్రమేయం లేకుండా మెట్లుకూడా పక్కనున్నాయి. ఇల్లు కొత్తగా కట్టిన యిల్లు. గదికి వైట్‌వాష్‌వేసి, కిటికీలకు తలుపులకు పెయింట్‌వేసి గది మూడముచ్చటగా వుంది. విద్యార్థికి గది చాలా బాగా నచ్చింది. మెడిసిన్ మూడోసంవత్సరం చదువుతున్న ఆనంద్‌బాబుకు నిజంగా ఆ గదిలో యింకొర్ని చేర్చుకోవడం యిష్టంలేదు. అయినా అతడికి విద్యార్థిని చూడగానే అతడిపై సదభిప్రాయం కలిగింది...అందుకనే 'సరే' అన్నాడు ..విద్యార్థికి నెత్తిమీంచి పెద్ద బరువు దించినట్లయింది...అయితే ఆ గది అద్దె యాభైరూపాయలు...అయినా విద్యార్థి వెనుకాడదల్చుకోలేదు.

(ఇంకా ఉంది)

# ఫైలేరియాసిస్

## — పి. రమేష్ నారాయణ

బోదకాలు, ఏనుగుకాలు, గజపాదము అంటూ సాధారణంగా పిలువబడే ఈ వ్యాధి వల్ల భారతదేశంలో ఎల్లప్పుడూ కనీసం 120 మిలియన్ ప్రజలు నికరంగా బాధపడుతూంటారని 1966 వ సంవత్సరంలో దేశ వ్యాప్తంగా కొనసాగిన ఒక సర్వేలో తేలింది. ఈ రోగంవల్ల మరణమంటూ రాకపోయినా రోగులు శారీరకంగా శ్రమ, ఇబ్బందులు పడుతుంటారు. ఉష్ణమండల దేశాలలో సర్వసామాన్యమయిన ఈ వ్యాధి సోకినపుడల కాళ్ళు, చేతులు, వృషణాలు, స్తనాలు స్తంభాల్లాగ లావెక్కిపోతాయి. ఇండియా, ఆగ్నేయాసియా, దక్షిణ చైనాల్లో సాలీనా 60 శాతం ప్రజలయినా ఈ వ్యాధికి బలవుతున్నారని నిపుణుల అంచనా.

నిజానికీ వ్యాధి అకశేరుకాల్లో గుండ్రటి పురుగుల వర్గానికి చెందిన వుకరేరియా బాంక్రాఫ్టి, బ్రూజీమలయీ అనబడే పరాన్న జీవులవల్ల వస్తుంది. క్యూలెక్స్‌జాతి దోమల వల్ల 'మైక్రోఫైలేరియా' అన్న లార్వాదశలో ఇవి మానవ శరీరంలో ప్రవేశించి జీవిత చక్రం కొనసాగిస్తాయి. మానవుల శోషరస నాళాల్లోను, గ్రంథుల్లోను జీవితాన్ని గడుపుకొనే ఈ పురుగులు రోగుల ఉపరితల రక్త ప్రవాహంలో రాత్రి 10 గంటల తర్వాత తెల్లవారి 2 గంటలవరకు సంచరిస్తాయి. దీని 'నాక్టర్‌నల్ పీరియాడిసిటీ' అంటారు. ఈ స్థితిలో మానవ రక్తాన్ని పరీక్షిస్తే ప్రతి రక్త బిందువులోను 300—600 సంఖ్యలో ఇవి వుంటాయి. ఈ సమయంలో రోగుల మొత్తం రక్తనాళాల్లో సుమారు 40—50 మిలియన్ల సంఖ్యలో ఇవి వుండే అవకాశాలున్నాయని లెక్క కట్టబడింది.

ఈ అంశంపై ఫిజీ, సమోవా లాంటి పసిఫిక్ దీవుల్లో సర్‌ఫిలిప్‌మాన్సన్— బార్ గావించిన పరిశోధన ఆధారంగా, బోధకాలు సోకిన ఆ రోగుల్లో రోగ జీవులు పై పీరియాడిసిటీని చూపక, రాత్రింబగళ్ళు సంచరిస్తాయని తేలింది.

మన దేశంలో 1923 వ సంవత్సరంలో డాక్టర్ సుందరరావు మరియు చోప్రాలు తొలిసారిగ ఈ వ్యాధికి సంబంధించిన పరిశోధనలు ఆరంభించారనవచ్చు. తర్వాతిగ 1944 లో బోర్ కమిటీ, 1956 లో నేషనల్ ఫైలేరియా కంట్రోల్ ప్రోగ్రాం, 1959 లో మొదలియార్ కమిటీలు ఏర్పరచబడి ఈ వ్యాధి నివారణకు దేశవ్యాప్తంగా చట్టబద్ధమయిన తగు చర్యలు ప్రభుత్వపరంగా కొనసాగాయి. పై కమిటీలసలహాల ఆధారంగా డి. డి. టి లాంటి క్రిమిసంహారక అవుషధాల ద్వారా దోమల నివారణ, డైఇథైల్ కార్బమజీన్ లాంటి రసాయన అవుషధాల వాడకాలవల్ల ఈ వ్యాధి దేశంలో తగ్గుముఖం పట్టిందనవచ్చు.

ఈ వ్యాధి నివారణలో ఆంటిమొనీ, ఆర్సెనిక్ సంయోగ పదార్థాలగు నియోసాల్వర్సాన్, సల్ఫార్సినాల్, నియొస్టిబొసాన్ ఇత్యాదులగు విషరసాయనాల వాడకాన్ని ప్రపంచ ఆరోగ్య సంస్థతోబాటుగ ఎన్నో అంతర్జాతీయ వైద్య బృందాలు ఆమోదించాయి. బ్రిటిష్ ఫార్మకాలజీ, అమెరికన్ మరియు ఇండియన్ మెడికల్ రిసర్చి విభాగాలకుచెందిన వైద్యశాస్త్రజ్ఞులగు ఫ్రీడ్‌హిమ్, రోజ్, కాల్బర్ట్‌సన్, శాంటియాగో— స్టీవెన్‌సన్, గుప్తా, భట్టాచార్య, విూనన్, రామమూర్తి, రావ్, హాకింగ్ మరియు తదితరుల బృందాలు ఈ రంగంలో ప్రముఖంగా పరిశోధనలు గావించిన శాస్త్రజ్ఞుల్లో మచ్చుకు కొద్దిమంది మాత్రమే.

భారతీయ శాస్త్రజ్ఞులు, వైద్యబృందాలు ఈ రంగంలో ప్రస్తుతం కొనసాగిస్తున్న ప్రశంసనీయమైన పరిశోధనలు త్వరలోనే సత్ఫలితాలనిస్తాయని ఆశిద్దాం.




# ఉతికే బిళ్ల
# డెటర్జెంట్ శక్తితో నిండినది
















**డెట్** డెటర్జెంట్ ఉతికే బిళ్ల

సబ్బు కంటె 50%
ఎక్కువ బట్టలను ఎక్కువ
తెల్లగా ఉతుకుతుంది
—మంచి నీళ్లు లేక ఉప్పు నీళ్లతో

shilpi: HPMA-43/70 TL




'మనం మధ్యతరగతివాళ్ళం. అందులో కూడా అడుగుపొరవాళ్ళం మనం అద్దెకుండే ఇళ్ళు కేవలం మనకోసం కట్టినవే! రెండుగదులు ఒక వంటగది ఉంటాయందులో. అది భరించేందుకే మనకు తాతలు దిగివస్తారు. మనచుట్టూ ఉండే వాళ్ళు మనలాంటివాళ్ళే—ఎందులోనో ఒక దానిలో గుమాస్తాగానో లేక అదే ఉద్యోగం ఇంకో పేరుతోనో చేస్తుంటారు.

ఈ పరిధి దాటవు మన జీవితాలు. అటువంటివాళ్లకే మన పిల్లలనిస్తాం. మన కోడళ్ళుగనూ అటువంటివాళ్ళే వస్తారు. జీవితమంతా అతికష్టపడి మనం కన్న సంతానాన్ని చదివించి మనలాంటివారికే ఇచ్చి పెళ్లిళ్లుచేసి 'ఈ లోకంలోకి వచ్చినందుకు మన కర్తవ్యం నెరవేర్చుకున్నాం' అని ఆనందపడి చేస్తాం. అక్కడినుంచి ఇదే పోరాటం మన పిల్లలూ మొదలెడతారు.'

'అయితే ఏమంటావోయ్, ఇంత ఎండిపు తాగి పైకెళ్ళిపోమంటావా?' అడిగాడు ఆ ఉపన్యాసాన్ని మధ్యలోనే అడ్డుకుని వెంకట్రావు.

నవ్వాడు చిరంజీవి. చిరంజీవి చాలా షోగ్గా నవ్వగలడు. అద్దంలో చూసుకుంటూ అది ప్రాక్టీసు చేశాడు. 'అదికాదు బావగారూ, ఈ వలయంలోంచి బయటపడేందుకు మనం కృషిచేయాలి. పై తరగతి వాళ్ళు వాళ్ల పిల్లల్ని కాన్వెంటులో చదివిస్తారు. అక్కడ అతి చక్కని పద్ధతుల్లో చదివిస్తారు వాళ్లని. వాళ్లకి చిన్నతనం నుంచే ఖరీదయిన బుద్ధులు, కోరికలు వస్తాయి. అలా అలా పెరిగి అన్నిటా పట్టాచేసి ఏ కలెక్టర్లుగానో, డాక్టర్లుగానో అయిపోతారు వాళ్ళు. ఇక మన పిల్లలు మామూలు స్కూళ్ళలో చదివి అక్కడ బూతుమాటలూ, సినిమా పాటలూ నేర్చుకుని అతికష్టంమీద డిగ్రీ సంపాయించుకుని సర్వీసు కమిషన్‌లో పాసయి గుమాస్తా అయిపోతారు. ఈ రెండురకాల జీవితాలు సమాంతరరేఖల్లాంటివి. అందులో మనం చేయవలసింది ఇటువంటి ఊబిలోంచి బయటపడేందుకు ప్రయత్నం.'

'సమాంతర రేఖలంటున్నావు ఇక ప్రయత్నం చేసినమాత్రం ప్రయోజనమేమిటోయ్.'

'లాంటివి' అన్నాను బావగారూ. మనకు కావలసింది అంతస్తు. ఆ అంతస్తులో ఉన్నవాళ్ళని మనం డబ్బుతో ప్రసన్నం చేసుకోలేం—ఎందుకంటే కొండంత దేముళ్ళు వాళ్ళు. అంతస్తు మనదగ్గరుండదు. వాళ్ళకి కావలసిన హోదాలని పలుకుబడితో మనం తెచ్చివ్వలేం— ఆ మాత్రం పలుకుబడే మనకుంటే మనమే దానిపైకి పోతాం. ఇక మిగిలిందేమిటి?'

అంతవరకు తమ్ముడు చెబుతున్న మాటల్ని ఆశతో, ఒళ్ళంతా చెవులు చేసుకుని వింటున్న పద్మావతికి నిస్పృహ కలిగింది. 'ఇంక మిగిలిందేమిట్రా నా బొంద?' అంది నిట్టూరుస్తూ. చేతికి అదృష్టం అందినట్టే అంది జారిపోతున్నట్టు అనిపించింది ఆవిడకి.

'కరెక్టక్కయ్యా, 'బొంద' అది మాట. ఎందుకంటే నీకు వెళ్ళిపోయింది. మాకి మన అందం ఒక్కటే పెట్టుబడి. అది కూడా లేనివాళ్ళని వదిలేసి మనం ఇలా ఆలోచించం. ఇప్పుడు ఉదాహరణకి మన కూతురు విజయ ఉంది. దాని అందం చాలా కొద్ది మందికే ఉంటుంది. మార్కెటులో కట్నాలకి పెళ్ళికొడుకుల్ని కొనుక్కోవాలని ప్రయత్నిస్తే మన కూతురికి ఆ రేటులో లెక్చరు, బాబాయి తప్పించి ఏమీ ఉండదు. అదే అందాన్ని సరిగ్గా ఉపయోగించి జాగ్రత్తగా వాడితే ఎం

చేయాలు పెంచుకున్నాం అనుకో! డబ్బు, కృత్రిమ హోదాలు — వీటితో విసిగిపోయిన చాకులాంటి కుర్రాడు, భవిష్యత్తు బోలెడు గలవాడు, అసలుసిసలైన ఈ మంచు బిందువులాంటి అందాన్ని చూసి మనకు దగ్గరవుతాడు...అది ఖాయం! షో కేసులో పెట్టిన కంటికి నదురయిన వస్తువుని ఖరీదు కొంచెం ఎక్కువ పెట్టినా ఎగరేసుకు పోతారు ...అసలు నన్నడిగితేనే అక్కయ్యా, అందానికి తెలివితేటలు జోడిస్తే అది ఆటంబాంబంత శక్తివంతంగా ఉంటుంది.'

విశ్వరూపం చూస్తున్నంత తన్మయత్వంతో వింటున్న పద్మావతిని, కొంచెం సిగ్గు నభినయిస్తున్నా అతి శ్రద్ధగా స్వప్న లోకంలోంచి వింటున్న కూతురు విజయని చూశాడు వెంకట్రావు. ఆయనకి కంగారొచ్చింది బావమరిది చెబుతున్న కబుర్లకి. 'ఒరేయ్ నాయనా, ఇటువంటివిటా నువ్వు చెప్పేది? తప్పురా ఇటువంటి ఆలోచన లోరేయ్! జరిగేపనులు కావురా నాయనా! మనస్సులనవసరంగా పాడు చేయకురా వాళ్ళవి'

పద్మావతి ఆలోచనలకి అంతరాయం కలిగింది. 'ఏమిటట వాడు చెప్పినదానిలో తప్పు? లోకరీతి చెప్పాడు అంతేగా! మొన్నటికి మొన్న సుశీలమ్మ కూతుర్ని ఆవిడ తమ్ముడు అస్సాం తీసుకెళ్ళి అక్కడ నలుగురికీ పరిచయం చేశాడు. ఇప్పుడది వన్నాలువందల రూపాయల జీతగాడి భార్య! మొన్న నొచ్చింది పచ్చగా తళతళలాడుతోంది. కాలు కింద పెట్టనివ్వడు దాన్ని వాళ్ళాయన. పైన కట్నం ఇచ్చేరు వాళ్ళు. అదేమంత అందమయినదీ కాదు. ఆలోచిస్తే మన విజయ ముందు.'

'అమ్మాయి నువ్వెళ్ళి చదువుకోమ్మా, పిచ్చివెధవలు ఇలాగే మాట్లాడుతుంటారులే పట్టించుకోకు' అన్నాడాయన ఆఖరి ప్రయత్నంగా.

లేచింది కాని ఆ అమ్మాయికి అక్కడ నుంచి వెళ్ళడం ఇష్టంలేనట్టు అలానే నిలబడింది...

నవ్వాడు చిరంజీవి 'మీ తరం వరకయిపోయింది బావగారూ. ప్రస్తుత కాలం మారె. మీరనుకునే పోటుతో ఇప్పుడు నలుగురం కుట్టించుకోగలం. మ్యూజియంలో వస్తువుల్లా వుండిపోయాయి మీలాంటివాళ్ళ భావాలు, అలవాట్లు. మాకున్న కోర్కెలు వేరు. మా చుట్టూ కొత్త కొత్త అందాలతో కనబడుతోంది ప్రపంచం. దాన్ని అనుభవించేందుకు తగిన స్తోమతు కావాలి. అది మాకిచ్చే ధన బలం మీకు లేదు. అందువలన మా శాయశక్తులా మమ్మల్ని ప్రయత్నించనీయండి.

'ఉన్నచోటు చాలును మీకు
ఇంకా వెనక్కి పోతామంటారు కూడా
మీలో కొందరు
ముందుకు పోతాం మేము.
ప్రపంచం మావెంట వస్తుంది'

అన్నారొక కవిగారు. ఓడిపోయిననాడు మనం అలవాటుపడిన మన మామూలు ప్రపంచం ఉండనే ఉంది. ప్రయత్నించడంలో తప్పేముంది?'

వెంకట్రావుగారడిగారు 'నువ్వెప్పుడు చేసుకుంటావు పెళ్ళి?' అని.

'అంతా విని మళ్ళా మొదటికొచ్చారు బావగారు. భూమ్యాకర్షణశక్తిని అధిగమించి పోవాలంటే 'ఎస్కేప్ వెలాసిటీ' అని ఉంటుంది. గంటకి ఇరవయియిదు వేలమైళ్ళ వేగంని దాటాలన్న మాట. అలాగే మనం ఈ మధ్యతరగతి నుంచి పైరకంలోకి మారాలంటే కూడా'—

'అవుతే ఆ ప్రయత్నం మీదే ఉన్నావన్న మాట. శుభం నువ్వు నీ ప్రయత్నాలు చేసుకోగాని అందరికీ ఇవి బోధించకు. పుణ్యం ఉంటుంది.'

చిరంజీవి వెళ్ళిపోయాక అతను సృష్టించిపోయిన మాయని సాధ్యమయినంతవరకు తొలగించాలని ప్రయత్నం చేశాడాయన. స్వశక్తిమీద, తన కాళ్ళమీద నిలబడి చేతనయితే బాగుపడాలిగాని ఇటువంటి అడ్డదారులా—వేధవ!'

పద్మావతికి కోపం వచ్చింది. 'ఆ శక్తి కూడా భగవంతుడే ప్రసాదించాలిగా!'

'అప్పుడు అంతా 'వాడు' చల్లగా చూస్తేనే, మనదేముంది?'

'అయితే అందంకూడా ఆయనిచ్చిందేగా!'

'ముమ్మాటికీ! ఏనాడో అదృష్టం చేసుకున్న వాళ్ళకే కనుముక్కు తీరు బాగుండేది!'

'అటువంటప్పుడు 'నీకు అందం ఇచ్చాను. అదే నీకున్న గొప్ప అర్హత. దానికి నీ తెలివి జోడించి బాగుపడమని భగవంతుడు చెప్పాడని ఎందుకనుకోకూడదు?'

ఒళ్ళు మండిందాయనకి.

'పినతల్లి కొడుకయినా వాడికీ నీకూ బాగా పోలికలున్నాయి మొండి పిడివాదంలో. దేముడి దయవలన ఈనాడిలా ఉన్నాము. అదే చాలునన్న తృప్తి ఎందుకుండదు మీకు?'

'అది జీవితంలో స్థిరపడిన మనకుండాలి. జీవితంలో ఇంకా మొదటి మెట్టుమీదనే ఉన్నవాళ్ళు ఆశపడాలి. అందులో తప్పులేదు.'

'చూడు పద్మా, మీపద్ధతి ఏమీ బాగుండలేదు. లేని ఆశలకి పోవడంకన్న జీవితంలో దేనికీ లేమి అన్నది లేకుండా ఉంటే చాలునన్న తృప్తిని పెంచుకోవడం మంచిది. నిక్షేపంగా నా మేనల్లుడున్నాడు మన విజయకి.'

'గుమాస్తా ఉద్యోగమేగా!'

'పోని నీ తమ్ముడున్నాడు.'

'వాడూ గుమాస్తేగా, కాకపోతే బాంకులో!'

'పోనీ వీడు—ఈ చిరంజీవి ఉన్నాడు.'

'సరేలెండి, వాడికే బోలెడు ఆశలున్నాయి. పాపం వాడిని మనం పాడుచేయడం దేనికి చక్కటివాడు— వాడి ప్రయత్నం వాడిని చేసుకోనియండి.'

'వాడి ప్రాణానికి నా సంబంధం గొప్పదే!'

'అని మన ఉద్దేశ్యం'

నిస్పృహ కలిగిందాయనకి. 'నీ ఇష్టం పద్మా' అన్నాడు చివరికి విసిగి.

పద్మావతి విజయ వంక చూసింది. ఆ అమ్మాయి నవ్వింది...

* * *

ఉమ వాళ్ళ ఇంట్లోకి వెళ్ళబోయిన విజయ మధ్య హాల్లో ఉమతోపాటు మరొక వ్యక్తి ఉండటం చూసి గుమ్మం దగ్గర తటపటాయించింది. ఎంతసేపటికీ తన రాకని ఉమ గుర్తించకపోవడంతో నెమ్మదిగా దగ్గి 'ఉమా' అనిపిలిచింది.

ఆడుతున్న చదరంగం బోర్డుమీదనుంచి తలెత్తి చూశారిద్దరూ. గుడ్నెస్! ఒక్కసారే లేచి నిలబడ్డాడతను.

# పద్మవ్యూహం

అతనివంక ఒకసారిచూసి గబగబ బయటకు వచ్చి 'రా విజయా, అటుపోయి నా గదిలో కూర్చుందాం' అంది ఉమ.

ఆ మాటలు విన్న అతను గబగబ దగ్గర కొచ్చి 'ఇది స్వార్థం ఉమా, ఒక మనిషిని, అందులోనూ కేవలం శలవుమీదున్న మనిషి, దానికి తోడు ఇందాకనుంచి నీకు బోరు కొట్టకుం... నీకుకంపెనీ ఇచ్చిన త్యాగ మూర్తిని వదిలి నీ స్నేహితురాలితో వెళ్ళి పోవడం—బేస్ ఇన్‌గ్రాటిట్యూడ్!' అన్నాడు.

తప్పుదన్నట్లుగా ముఖం పెట్టి లోపలికి తీసుకొచ్చింది విజయని. వస్తూనే 'ఈమె మా క్లాసుమేటు విజయ. ఈయన మా మామయ్య జానకిరాం. మిలిటరీలో డాక్టరుగా ఉన్నారు' అంటూ పరిచయం చేసింది ఉమ విజయని.

అతన్నిచూసి 'నమస్కారమండి' అంటూ చేతులు జోడించింది విజయ.

'నమస్కారం కార్లోండి. ఇప్పుడే మీ టాపిక్ వచ్చింది' అన్నాడు జానకిరాం నవ్వుతూ.

'ఎందుకో' అంది ఖంగారుగా విజయ ఉమవైపు చూసి.

'మన పిక్నిక్ ఫోటోలు చూస్తున్నాడు మామయ్య — ఆల్బంలోవి. 'ఈవిడెవరు' అనడిగాడు నిన్ను చూపించి. నీ పేరు చెప్పాను' అంది ఉమ.

'ఏమని అడిగాడో చెప్పవేం—జలసీయా?'

'నాకేమిటిట! మేమందరం విజయకి వ్యాడో బ్యూటీక్వీన్ అని పేరు పెట్టుకున్నాం. నువ్విచ్చే కాంప్లిమెంటేమిటి కొత్తగా!'

అతనిచ్చిన కాంప్లిమెంటేమిటో వినాలని పించింది విజయకి. కాని అది చెప్పకుండా 'కాఫీలు తెస్తాను కూర్చో' అంటూ లేచింది ఉమ.

'అవ్వే, ఇప్పుడే తాగొచ్చాను ఉమా ఒద్దొద్దు.'

'నో— ఆగండి మీరు. అతిథుల్ని మర్యాద చేయాలి. అది రూలు. ఒకరల్లా ఇద్దరం అయ్యాం అతిథులం.'

ఉమ వెళ్ళిపోయింది లోపలికి. తననే అతను చూస్తూండటం గమనించి తల వంచుకుని కూర్చుంది విజయ.

'కాంప్లిమెంటంది—ఏమిచ్చానో వినాలని లేదూ మీకు' అన్నాడు నవ్వుతూ జానకిరాం.

తలెత్తి నవ్వుతూ 'ఎందుకుండదు?' అంది విజయ.

'ఈ చుక్కల్లో చంద్రుడిలా మెరుస్తున్న ఈ అమ్మాయెవరు? అనడిగాను. అప్పుడు చెప్పింది మీ గురించి. 'బాగుంటుంది' అన్న ఒక్కమాటే అంది. కాని అది చాలదు.'

'మరేమనాలో?'

'తాజ్ మహాల్ ఎదురుగా నిలబడి ఏమంటారు?'

నవ్వింది విజయ. అప్పుడే కాఫీ తీసుకొచ్చింది ఉమ. కాఫీ తీసుకుంటూ జానకిరాంని పరీక్షించి చూసింది విజయ. గ్రీకు దేముడిలా ఉన్నాడు. చెక్కినట్లున్న ముక్కు, బలమయిన ముఖం — చిన్నప్పుడెప్పుడో చూసిన బెన్‌హర్ సినిమా గుర్తుకొచ్చింది.

కాఫీ తాగేసి పక్కనున్న బజర్ నొక్కాడు జానకిరాం. పనిమనిషి పరుగెత్తుకుంటూ వచ్చింది 'ఏమిటబ్బాయి గారూ' అంటూ.

'గబాలున వెళ్ళి గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్టు పెట్టె పట్టుకురా.' అని డబ్బులిచ్చాడు. అది వెళ్ళిపోయాక 'మావాళ్ళ ఇంట్లో ఇటువంటి డిసిప్లిన్ ఎప్పుడయినా చూశారండి మీరు. మనం ఉన్నన్ని రోజులూ ఇంతే. కనుసన్నలలో మెలగాలి. ఎంతయినా మిలిటరీవాడిని కదండీ!'

'దానికెంత ఖర్చవుతుందో కూడా అడుగు విజయా. దాన్నిబట్టే ఈయనకి గౌరవం. లేకపోతే ముఖం చూసేదెవరుట?' అంది అప్పుడే లోపలికి వస్తున్న పార్వతి.

'నా పద్ధతేమిటో తెలుసా మిస్ విజయా—మిస్ అన్నది కరెక్టే కదూ! దట్స్ గుడ్. వెనకటికో చిత్రకారుడు తన స్నేహితుడయిన ఒక డాక్టరుగార్ని పిలిచి తను గీసిన బొమ్మని చూపించాడుట. ఆ డాక్టరుగారు బొమ్మవంక నిశితంగా చూసి 'బాగా ముదిరిపోయిన ఎనీమిక్ కేస్' అన్నాడుట. ఆ గీసినవాడెవడో అబ్బురపడి గోల పెట్టి ఉంటాడు...ఇంతకీ నేను మొదలెట్టిందెక్కడో!'

'మిస్ దగ్గర ఆగావు' అంది పార్వతి.

'థాంక్స్. అలాగే మనుష్యుల్ని చూస్తూనే జాతకాలు చెప్పగలను నేను...అవునూ అసలిదంతా ఎందుకొచ్చింది?'

'నీ పద్ధతులేమిటో విజయకి వివరిస్తున్నావు' అంది పార్వతి మళ్ళీ.

'థాంక్స్. మొత్తానికి చాలా సహాయం చేస్తున్నావు సుమీ! ప్రయివేటు ప్రాక్టీసు పెట్టాక నిన్ను ఆపరేషన్ థియేటర్లో నర్సుగా వేసుకుంటాలే... అయాం సారీ మళ్ళీ ఎక్కడున్నానో మరిచిపోయాను. ఎవ్వరూ సహాయపడకండీ సారి...ఆ కరెక్టు నా పద్ధతండి విజయగారూ, ఖర్చుపెట్టగలిగిన స్తోమతున్నప్పుడు జీవితాన్ని అనుభవించాలి. అందుకనే నేను శలవుమీదున్న ఈ రెండు నెలలూ మా అక్కయ్యని కాని, వీళ్ళనిద్దరినీ కాని-ఎవ్వరినీ కష్టపడనియ్యకుండా నౌకర్ని, చాకర్ని ఏర్పాటు చేస్తాను. ఆ సుఖం అలవాటుపడ్డాకనయినా మా బావగారు కొంచెం ఖర్చుపెట్టటాని కలవాటు పడతారేమోనని నా ఆశ. కాని నే వెళ్ళిన మర్నాడే అందరికీ ఉద్వాసన చెప్పేస్తారాయన.'

'అవును, విజయా, ఈయనకేం బ్రహ్మ

## సినీ చిటపటలు

సెక్సులేనిఫిల్ము ఎక్కులెంటుగబోదు
కథయు, పాత్ర సృష్టి కల్గియున్న
రంభలేని సభకు రాణింపులేదురా
సినిమకనెదు నరుడ కనర నిజము.

ముద్దుచెల్లనిదెచటి ముద్రలభించెరా
వెండితెరలమీద వింత ఏల?
సెక్సుబోర్డు వచ్చె సెన్సారుమాయమై
సినిమకనెదు నరుడ కనర నిజము.

అభినయంబుగాదు హావభావముగాదు
గాత్రశుద్ధిగాదు పాత్రగాదు
నటతి నటనకన్న వంపుకే విలువాయె
సినిమకనెదు నరుడ కనర నిజము.

తియ్యనైనతేట తెనుగులో వ్రాసిన
పాటలేల యితర బాషబాణి
అనుకరింపకున్న ఆంధ్రత్వ మబ్బదా?
సినిమకనెదు నరుడ కనరనిజము.

ఎంతమందియున్న నెదిరింపగొక్కండె
ఎత్తునుండి పడిన నేమిగాదు
సినిమ హీరోముందు చిత్తురా నెవ్వడైన
సినిమకనెదు నరుడ కనర నిజము.

—కె. కె. శాస్త్రి

# మామూలు రకం కాఫీలపై విప్లవం జరపండి !

## స్పెషల్ కాఫీ మాత్రమే కావాలని అడగండి

**ప్రత్యేక శక్తి నిస్తుంది**

ఇది చిక్కనైన సంతుష్టికరమైన కాఫీ. దక్షిణాదిలోని కాఫీప్రియుల రుచికి అనుగుణ్యంగా ప్రత్యేకంగా తయారుచేయబడినది.

**ప్రత్యేకమైన రంగు**

చిక్కనైన మంచి కాఫీకి అర్ధ చెంచా పొడి చాలు. మీ కప్పులో నల్లని ఎక్కువ సంతృప్తి నిచ్చే కాఫీ తయారవుతుంది.

**ప్రత్యేకమైన ప్యాకింగు**

తాజాగా సువాసన రుచిపోకుండా భద్రపరచటానికి మనదేశంలో రికరి ప్రప్రథమంగా ముందడుగు వేసింది. తేలికగా తెరవగల ప్లాస్టిక్ మూతతో లోపల "సేఫ్టీ సీలు వున్న" రికరి లభ్యమవుతుంది. నేడు లభించే సీసాలన్నిటికన్న అధునికమైనది.

ధర
రూ. 2.87
ఇతర పన్నులు
అదనం.

## కొత్తది! అధిక స్ట్రాంగ్

# రికరి.

## ఇన్‌స్టెంట్

ఇది ప్రత్యేకమైనది! ఇది నెస్‌కాఫే వారు తయారు చేసినది



వంకనే చూస్తూ.

'సరే మీ ఇష్టం'

'మీ ఫాదర్ వాళ్ళేమయినా ఇంగారు పడతారేమో' అంది పార్వతి.

'ఏమీ అనుకోరు. కావాలంటే నేవెళ్ళి చెప్పొస్తాను' అన్నాడు జానకిరాం.

'నీకు తెలుసా వాళ్ళ ఇల్లు?' అడిగింది పార్వతి.

నవ్వేశాడు జానకిరాం 'ఇదుగో పార్వతీ, నువ్వు నన్ను మాటల్లో పడగొడదామని ప్రయత్నించడం మానుకో — అదినీకే మంచిది'

'అహా అదికాదులే, పెద్ద తెలిసిన వాడిలా అంటేను అడిగాను'

'అవునూ అసలా మాట కొస్తే నిముషాల్లో కనుక్కుంటాను వాళ్ల ఇల్లు తెలుసా?'

'అదే ఎలాగని!'

'ఆల్ రైట్ విను. రోడ్డుమీదికి వెళ్ళి కాలేజీలో చదువుతున్నారన్న అనుమానం కలిగిన కుర్రాళ్లని ఇద్దరు ముగ్గుర్ని అడుగుతాను మీరే కాలేజి అని ... ఒక్కడయినా మీ కాలేజి వాడుగ పడకపోడు. అప్పుడు 'మీ కాలేజీలోనే చదువుతోంది ఫలానా విజయ — ఇల్లు తెలుసుటోయ్ బ్రదర్. నేను వాళ్ళ బంధువునిలే' అంటే అదొక పెద్ద అవకాశంగా వాడు నన్ను వెంటేసుకుని మరీ తీసుకు వెడతాడు వీళ్ళ ఇంటికి. ఇటువంటి వాళ్ళ ఇల్లు అందరికీ గుర్తుంటుంది. ఇటువంటి వాళ్ళ పేరు అందరూ స్మరిస్తుంటారు.'

ఉమ పార్వతి వంక చూసింది 'ఏదయినా తెగేదాకా లాగుతావే నువ్వు' అంది విసుగ్గా.

నవ్వాడు జానకిరాం. 'చూశావా ఇంత జీనియస్ని గుర్తింపు లేక రాటుబోతున్నాను'

'తెలివికి గుర్తింపుండక కాదు. ఆ తెలివి మంచి మార్గాన పనిచేయక ఇలాగయిపోయావు.'

'ఎలా అయిపోయాను? నాకేం తక్కువ. చప్పట్లు కొడితే పదిమంది ఆడపిల్లల తల్లిదండ్రులు వస్తారు ఈ క్షణంలో'

'కొత్తేందుకా?'

ఉమకి సహనం చచ్చిపోయింది. విజయ ఇదంతా సరదాగా వింటుండటం చూసి ఆ అమ్మాయికి కోపం వచ్చేసింది 'నోరు మూస్తావా లేదా పార్వతి?' అంది.

ఉమకి జేరగానే తన టిక్కెట్టుకి జానకి

# భక్తుని పరమ సంకల్పం



ధర్మపథం. ఇబసు వెంకటరమణయ్య

నిజమైన భక్తుడికి భగవంతుని సేవ తప్ప మరొక విషయంపై అభిలాష, ఆసక్తి ఉండవు అతని పరమ సంకల్పాన్ని గురించి భాగవతంలో ఈ విధంగా చెప్పబడి ఉన్నది—

'వాణీ గుణానుకథనే శ్రవణౌ కథాయాం
హస్తౌ చ కర్మసు మనస్తవ పాదయోర్నః,
స్మృత్యాం శిరస్తవ నివాస జగత్ప్రణామే
దృష్టిః సతాం దర్శనేఽస్తు
భవత్తనూనామ్.'

'ఓ భగవంతుడా! నేను పలికేమాటలు కేవలం నీ గుణాలను కీర్తించడానికే ఉపయోగపడుతూ ఉండాలి' చెవులు ఎప్పుడూ నీ కథలను వినుటయందే ఆసక్తములయి ఉండాలి. నా చేతులు నీకు కావలసినపనులు చెయ్యడానికే ఉపయోగపడుతూ ఉండాలి. నా మనస్సు ఎప్పుడూ నీ పాదాలపయినే లగ్నమయి ఉండవలెను. నాతలపు లెప్పుడూ నిన్నుగురించిన ఆలోచనలయి ఉండాలి. నా శిరస్సు నీవు నివసించే లోకానికి నమస్కారం చెయ్యడంలోనే—అనగా — అవైపు వంగి ఉండడంలోనే లగ్నమయి ఉండాలి, నాచూపు సర్వదా నీయొక్క వివిధములైన అర్చావతారాలను చూచుటయందే ఆసక్తమయి ఉండాలి' అని దీని అభిప్రాయం.

మానవుని ఇంద్రియాలలో కొన్ని జ్ఞానేంద్రియాలు: కొన్ని కర్మేంద్రియాలు. నిత్యజీవితంలో వీటి అవసరమెంతైనా ఉన్నది. ఇవి తమతమ ధర్మాలను నెరవేర్చక పోతె ఏపనీ జరగదు.

అయినా— కొందరు వీటిని స్వంతానికి ఉపయోగించడానికి విముఖులై ఇతరులకు సహాయం చెయ్యడానికే నిశ్చయించి తమ శక్తికొలదీ అందుకు పాటుపడతారు. పరులకు ఉపకారం చెయ్యడం కూడా స్వార్థమే అవుతుంది— ఏమంటే—దానివల్ల లభించే పుణ్యం — ఉపకారం చేసినవానికే చెందుతున్నది.

అలా కాకుండా తన అవయవాలను భగవత్సేవలోనే వినియోగించే పద్ధతి అత్యుత్తమమైనది. 'తత్కురుష్వ మదర్పణం' అని ఏపని చేసినా—దాన్ని భగవదర్పణంగా భావించడమే ఉత్తమమని భగవద్గీత చెప్తూ ఉన్నది.

తాను చేసే పనులన్నీ భగవదర్పణంగా చేయడమే ఉత్తమ పద్ధతి నిజమైన భక్తునియొక్క పరమ సంకల్పం అదే!

రాంకి డబ్బివ్వ బోయింది విజయ. అతను వద్దన్నాడు. అంటూనే ఆమెని ఒక పక్కకి తీసుకు వెళ్ళి 'నాకెంతో ఆనందం కలిగించే విషయం మీ టికట్లు కొనడమే! మిగిలిన వాళ్ళంతా అలా కొనడం నా డ్యూటీ అను కునే వాళ్ళు కనుక!... నాకా ఆనందం దక్కనీయండి.'

'అవుననుకోండి అయినా నేనసలు నా స్నేహితులనే కొననివ్వను'

'అటువంటి ఆలోచన కూడా రానివ్వ

## పద్మవ్యూహం

కండి. మనిద్దరం కావాలంటే కలిసి ఏడడుగులు వేద్దాం రండి.'

'ఎందుకో?'

'ఇంతక్రితం స్నేహితులం కామనుకుంటే ఏడడుగులు వేశాకనయినా అయిపోతాం. మరో ఏడు వేశామంటే అంతకన్న ఎక్కువ వాళ్ళం అయినా అయిపోవచ్చును. అప్పుడు నేనే మీ టికట్లు కొనాలిసి ఉంటుంది.'

నవ్వింది విజయ. 'కొందరికి నవ్వే గిఫ్ట్' అన్నాడు జానకిరాం.

వీళ్ళనిద్దరినీ చూసి గబగబ దగ్గర కొచ్చింది ఉమ. 'ఏమయిపోయిందా విజయ అని చూస్తున్నాను...ఏమిటి నీకేదో ప్రయివేటు చెబుతున్నట్టున్నాడు.'

'ఉమ మంచిది, పార్వతి గడుసుది' అని చెబుతున్నాను.

మన్వేం సర్టిఫికేటు ఇవ్వనవసరం లేదు. కబుర్లు చెబుతూ నిలబడి పోయావు టికట్లు కొననేం.'

'ఇంకా బుకింగ్ తెరవలేదు. వ్యాట్ని వదలేదు కూడా.'

సినిమా అయిపోయాక విజయని రిక్షా ఎక్కించి ఆమెని వాళ్ళ ఇంటి దగ్గర దింపి మరీ వెళ్ళాడు జానకిరాం. వెడుతూ వెడుతూ 'రేపు మీ కోసం ఎదురు చూస్తుంటాం' అని నవ్వి 'సిగ్గుపడకుండా చెప్పాలంటే ఎదురు చూసేది నేనే!' అన్నాడు.

భోజనం చేసి పడుకుందన్న మాటే గాని విజయకి కళ్ళుమూసినా తెరిచినా జానకిరామే అగపడుతున్నాడు. 'ఇంటర్వెల్‌లో ఉమ, పార్వతి హాల్లో లేనప్పుడు డ్రింకులు తెప్పించి నాటిల్ స్వయంగా తనకిచ్చాడు ... మళ్ళీ తాగేశాక తన చేతిలోంచి ఖాళీసీసా అతనే అందుకున్నాడు. 'కుర్రాడిని రానీయండి వాడికిస్తాను' అంది తనక్కడకే. అప్పుడు తన మీదికి వంగి మెల్లిగా అన్నాడు 'చెప్పాగా— నాకు ఆనందం కలిగించే పనులు చేయడంలో మీరు అడ్డు రాకండి. ఆ మాట కొస్తే ఈ సీసాకి డబ్బు కట్టేసి పట్టుకుపోవాలని ఉంది తెలుసా' అని.

తనకెక్కడలేని సిగ్గు వచ్చింది అతని చొరవకి. అతని ఆ మాట, వంగినప్పుడు తనని కమ్ముకున్న సెంటువాసన తనకేదో మత్తు చల్లాయి.

గుమ్మంలోంచి ఇదంతా చూసినట్టుంది పార్వతి. ఉమకేదో చెప్పింది ఉమ గబగబ వచ్చి తనపక్కన కూర్చోవడం తనకే నవ్వునే తెప్పించింది. ఉమ ముఖం చిట్లించుకోవడం తను చూడకపోలేదు కూడా. ఆ అమ్మాయిని చూసి జాలి కూడా పడ్డది. ఆక్కడికీ తను అవన్నీ గమనించే ప్రవర్తిస్తోంది. కాని అతనే...' నవ్వుకుంటూ నిద్రలోకి జారిపోయింది విజయ.

(ముగింపు వైవారం)




పాతకాలం పంతులమ్మలు అదృశ్యం అయిపోతున్నారు. వీధిబళ్ళు పోతున్నాయి. ఈనాడు వాళ్ళున్నా వాళ్ళ అనుభవం గుర్తింపబడదు. వాళ్ళే పరీక్షలాగ్రటా పాసయి వుండరు. అయితేనేం? పిల్లల్ని చెప్పిన మాటవినేలా చేయకల్గేవారు. హైక్లాసులోకి వెళ్ళేసరికే చదువనూ రాయనూ వచ్చేది. ఆడపిల్ల సరిగా వారకుట్టు కుట్టలేకపోతే — ఎందుకూ పనికిరానట్టు తిట్టి కొట్టి నేర్పేదావిడ. ఆ పాతకాలపు టీచరమ్మ పద్ధతులు వేరైనా పిల్లల్లో క్రమశిక్షణ బీజాలు నాటకల్గేది, ఈ రోజుల్లోనే కనక నా పంతులమ్మ ఉంటే ఇనస్పెక్టరుగారు తీసి పారేయమనేవారే. 'పిల్లలలో హార్సుని అక్షరాలు దిద్దేయికూడదు ఆటపాటలతో నేర్పాలండి.' అంటారు. వాళ్ళంతట వాళ్ళని అన్నీ నేర్చుకోనివ్వాలి అంటారు. ఇంతెందుకు మా దిబ్బపంతులమ్మ గారీనాడు పిచలైన నర్సరీ స్కూలు చూస్తే హవ్వ! అని నోటిమీద చెయ్యి వేసుకుంటుంది. తప్పదు.

ఈ 'ఎవరంతటవాళ్ళు నేర్చుకోవాలి' పద్ధతి ఫలితాలు మనం చూస్తూనే వున్నాం. క్రమశిక్షణకి అలవాటు పడని పసివాళ్ళు యీ యుక్తప్రపంచంలో ఉన్న కట్టుబాట్లకు ఎలా కట్టుబడి వుండాలో తెలియక కొట్టుమిట్టాడుతున్నారు. అందుకే 'మేం ఎంచేస్తే అది ఘనకార్యం' అన్న ధోరణిలో తిరగాలని చూస్తారు. వారి భావనా ప్రపంచానికి వేళ్ళు లేవు. వారి మానసికావేశాలకి పగ్గాలు లేవు. ప్రపంచం వారికి రుణపడి వుందనుకుంటారు. వారు మాత్రం దేనికీ, ఎవరికీ...బాకీ లేమనుకుంటారు.'

కాని ఓక్షణం ఆలోచించి చూసుకుంటే క్రమశిక్షణ లేకపోవడమే వారిలో పెద్ద లోటని వారికే తెలుసును. నిజానికి మనం

## ఎక్కడుందా సోషలిజం?

పెరిగిపోతున్న నేటి ధరల్లో?
తరగని మన నిరుద్యోగుల్లో?
మారిపోతున్న లక్షల లాటరీల్లో?
అవురా! మరింకెక్కడుందో?

రాష్ట్రపతి క్రొత్త 'బెంజి' కార్లో?
రాష్ట్రమంత్రుల యింట్ల పెళ్ళిళ్లో?
కేంద్రమంత్రుల విదేశ యాత్రల్లో?
అందకుండావుందే మరింకెక్కడుందో?

వార్తాపత్రికల 'హెడ్‌లైన్స్'లో!
అర్థంలేని నాయకుల వాగ్దానాల్లో!
వ్యర్థమైన పెద్ద రేడియో ప్రసంగాల్లో!
అర్థమయిందిగా సోషలిజం ఎక్కడుందో

—పి. సూర్యప్రకాశరావు

దరం ఏదోరకం క్రమశిక్షణకి కట్టుబడి వుండాలి. అది అవసరం. క్రమశిక్షణ లేకపోవడం అంటే ప్రేమ ఆదరణ లేవన్నమాట. ఎవరికీ మనం అంటే ఖాతరు లేదన్నమాట ఈ విషయాన్ని చిన్నపిల్లలు గ్రహించినంత త్వరగా ఎవరూ గ్రహించరు.

పిల్లలకి ఒకపద్ధతి అన్నది యిట్టే అలవాటు అవుతుంది. వాళ్ళేం చేయాలని మనం అనుకుంటున్నామో తెలిస్తే హాయిగా ఉంటారు. అలా చేయకపోతే జరిగే ప్రమాదం కూడా తెలిస్తే మరీ హాయిగా వుంటారు. మనం పట్టించుకోకుండా వుంటే వారు సంతోషిస్తారనుకోవడం తప్పు. అలా చేస్తేనే వారికి 'రక్షణ' లోపించినట్టు ఫీలయి పోతారు.

మా పిన్నికొడుకు పధ్నాలుగేళ్ళవాడు. రానురాను మరీ పొగరుబోతుగా జులాయిలా తయారై ఆ తల్లికి ప్రాణసంకటంగా పరిణమించాడు. తండ్రిలేని పిల్లవాడని వాడేంచేసినా చూసీ చూడనట్టు వూరుకునే మాపిన్నికోరోజు తిక్కరేగింది. 'అంతే— చీపురు విరిగేలా చితక్కొట్టింది. మరి తిరిగి చూడకుండా వెళ్ళి పెరట్లో పంపు కొట్టుకోవడం మొదలెట్టింది — కోపం తీరక. కాస్సేపటికి కుర్రాడే తల్లిదగ్గరకి వచ్చి పంపు అందుకుంటూ 'ఈమాటు కొట్టేటట్టయితే యింకొంచెం గట్టిది తీసుకో' అంటూ నవ్వాడట. ఈ సంగతి చెప్పి 'యిక మళ్ళీ వాడిని కొట్టవలసిన అవసరం రాలేదు. చాలా మారాడు' అంది పిన్ని. కాని అదే కనక 'నువ్వేంచేసినా భరిస్తాన'న్నట్టు పిన్ని ఊరుకునివుంటే— ఈ మార్పు రావవచ్చేది కాదేమో!

అందుకే అనడం క్రమశిక్షణ పిల్లలలో నమ్మిక పెంచి 'మన తల్లితండ్రులకి మనం కావాలి. మనం ఏం చేస్తున్నామో గమనిస్తారు' అన్న నమ్మకం కల్గుతుంది.

పిల్లలు తగని అల్లరి చేస్తారు— వాళ్ళని పట్టించుకునే వాళ్ళులేక. వాళ్ళని కేకలేసేవాళ్ళులేక. మనమేమో 'వాళ్ళదారిన వాళ్ళుండనియ్యి' అనుకుంటాం. ఈ తేడాతోనే యువతరం అటూ ఇటూ కాని అయోమయంలో పడి నడుస్తోంది. పువ్వు లాంటి అమ్మచేతికి అవసరం అయితే ఇనుములాంటి కాఠిన్యం అబ్బుతుందని తెలిస్తేనే పిల్లలకి సందా. ●




### జరిగిన కథ

మాధవరావు ఆ ఊళ్ళోకి స్కూలు మాస్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యబోతే అతను దెబ్బకాటుకు గురి అయ్యాడు. రామ్మగారు అతన్ని ఇంటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆ తర్వాత అతనిదగ్గర చదువుకోవడం ఆరంభించింది. రంగరాజు కొడుకు రాజారావు ఊరికి ప్రెసిడెంటుగా నెగ్గాడని ఆమె చాలా బాధపడింది. మాధవికి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. రాజారావు రాధని నిర్బంధించాడు. మాధవరావుకు సంబంధించిన ఒక రహస్యాన్ని వెల్లడించాడు. రాధ నమ్మలేదు. రాజారావు అత్యాచారం చెయ్యబోగా ఆమెకి స్పృహ తప్పింది. మాధవరావు ఆమెని రక్షించాడు. దెబ్బలు తగిలిన మాధవరావు రాధ సపర్యలో కోలుకుంటూ ఉన్నాడు. మాధవరావు తల్లి విషాదగాధ రాధని కలచి వేస్తుంది. శశికళతో తన పరిచయాన్ని రాధకి వివరిస్తాడు మాధవరావు. అతని కథంతా చెప్పుకు వచ్చాడు. అప్పగారు ఎలా వంచించిందీ వివరించాడు. అనురాధకి ఇప్పుడు అతనిమీద అభిమానం మరింతగా పెరిగింది. వారిద్దరికీ పెద్దలు వివాహం నిశ్చయం చేశారు. మాధవరావుని ఆ ఊరినుంచి ట్రాన్స్‌ఫర్ చేయించాడు రాజారావు. ఉన్నంతలో ప్రయత్నం చేశారు.

23

మధుర స్వప్నాల మత్తునుండి ఉషః కాంతులు నన్ను మేల్కొలిపాయి. వసంతకాలపు వలపు తలపులు మానస వీణ మంజులనాదంతో మేళవించగా శారదను చేతుల్లోకి తీసుకున్నాను.

మువ్వగోపాలుని పైన చప్పటగా మూడు పాటలు పాడుకొన్నాను. వీణానాదంలో తన్మయమై ఉన్న నాకు వెనుక కరతాళ ధ్వని వినిపించేసరికి ఉలిక్కిపడ్డాను. మాధవి! అంత ప్రొద్దున్నే ఆమె వచ్చిందనుకోలేదు.

'రాధామనోహరుడు మూడు రోజులదాకా నీకింక కనిపించడే అనూ!' అంది మాధవి నా భుజాలు పట్టుకొని ఊపుతూ.

'ఏం?'

'ఈవేళ నిన్నిక్కడ పెళ్ళికూతుర్ని చేస్తుంటే అతనిక్కడెలా ఉంటాడు? అతన్ని పెళ్ళికొడుకని చేయొద్దూ!... ఇద్దరూ ఎదురుపడితే ఇంకేమైనా ఉందా? అందుకని మా యింటికి మధు అన్నయ్య మకాం మార్చేస్తున్నాడు.'

'అయితే, పెళ్ళయ్యేదాకా చూడకూడదన్నమాట!'

'ఉహూఁ! చూడకూడదు...ఏం, రహస్య సమావేశం ఏమన్నా ఏర్పాటు చేయమన్నావా? జాగ్రత్త! ఎవరైనా వింటే నోళ్ళు నొక్కుకొని చెవులు మెలేస్తారు. మూడు రోజుల్లో మూడు ముళ్ళు వేయించుకొని మొగుడు దగ్గరకి...'

'...ఏయ్ మధూ!'

'ఓహో! ప్రియుని దగ్గరకి అనమంటావా?'

'అబ్బ, నువ్విలా పరిహాసం చేస్తే నీతో మాట్లాడనే!'

'మన్నించు. మాటాడవద్దు మనోహర మనోజ్ఞ మధురభాషిణీ! నీ చిరునవ్వుల పువ్వుల నేరుకొననిమ్ము చాలు. నీ అనురాగ లతకు ఆ పూవులను గుచ్చి నీ ప్రియుని కంఠించవె చెలీ!'

నెచ్చెలినేమి అనలేక సిగ్గుల మొగ్గనవుతూ నవ్వును దాచుకుంటూ అక్కడ నుంచి లేచిపోయాను. మధూ నన్ను వదలి పెట్టలేదు. మాటి మాటికి తన చిలిపి మాటలతో నన్ను తీయని వేదనకు గురి చేస్తూనే ఉంది.

ఆమె హడావిడికి అంతు లేదు. పలువురిని పేరంటానికి పిలిచి వచ్చింది.

రంగదాసు సన్నాయిమేళంతో వచ్చాడు. '...మీ నాన్నగారి పెళ్ళికి నేనే మేళం వాయించాను రాధమ్మా! మళ్ళీ ఇన్నాళ్ళకు నాకీ భాగ్యం దక్కింది. పప్పన్నం పెడ్తావని ఎన్నాళ్ళనుంచో ఎదురు చూసాను. ఇప్పటికి నీకు దయ కలిగింది...' అన్నాడు రంగదాసు. నేను నవ్వుకున్నాను.

ఇంటిముందు పందిరి వేయించే హడావిడిలో ఉన్నారు నాన్నగారు. సన్నాయి మ్రోగుతోంది. ముత్తయిదువలు వచ్చారు. నా నుదుట నిలువుగా కుంకం బొట్టు పెట్టి కాళ్ళకు పారాణి పెట్టింది మాధవి. నాకు మంగళహారతి ఇచ్చింది. తన మధుర కంఠంతో ఒక పాట పాడింది. ఎప్పుడూ ఎవ్వరి ఎదుట పాడని మాధవి ఆ సమయంలో పాడేసరికి నాకు ఎంతో ఆనందమయింది. ముత్తయిదువుల అక్షింతలు నా శిరస్సుపై వర్షించాయి. వివి తాను భూతితో ఒడలు పులకించి మనస్సుప్పొంగింది.

తర్వాత నా అభ్యంగనస్నానం పూర్తయింది. క్రొత్త పట్టుచీర గులాబిరంగుది కట్టుకున్నాను. ఆదేరంగు జాకెట్టు తొడు

కున్నాను. జూకాలు పెట్టుకున్నాను. బుగ్గన అక్కుల చుక్క, కళ్ళకు కాటుక, కళ్యాణం బొట్టు, పాదాలకు పారాణి పెట్టింది మాధవి.

క్రితం రోజున పెట్టుకున్న గోరింటాకు చేతి వ్రేళ్ళపై తళుకు లీనుతోంది. జుట్టు బాగా పొడారిపోయాక వాలుజడవేసి పెద్ద పూలమాలను నా జడలో తురిమింది మాధవి. నా భుజాలు పట్టుకొని నన్నాపాద మస్తకం కళ్ళింత చేసుకుని చూసింది ఆమె. సిగ్గు ముంచుకురాగా నా ఒళ్ళు ముద్దగా ముడుచుకుంది.

'...నీ గొంతులో ఈ గొలుసు వెల వెల బోతోందే అనూ!...నా నెక్లెసు తెస్తాను. వేసుకోవూ ?'

నేను చిన్నగా నవ్వి అన్నాను. 'నీ తృప్తి కోసం వేసుకుంటాను కాని...తర్వాత అమ్మ లక్కలడిగే ప్రశ్నలకేమని జవాబు చెప్పను?'

బాధగా చూసింది మాధవి.

'నువ్వు ముఖం చిన్నబుచ్చుకుంటే నా మనస్సు చివుక్కుమంటుంది మధూ! అలంకారాలు ఆకర్షణకి కాని అందానికి కావు కదా!'

'అవును. దేవుడిచ్చిన అందమే నీకు ఆకర్షణ...వేరే అలంకారా లెందుకు ?'

మధ్యాహ్నం వేణుగోపాల్ వచ్చాడు. మా ఇంటికి నిండుతనం తెచ్చాడు. నాన్నగారు, బామ్మ అతని రాకతో పరమానంద భరితు లయ్యారు. నా ఆనందానికి అంతే లేదు. మాధవి, అతను పాత జ్ఞాపకాలతో క్షణం పాటు విచలితులయ్యారు. కాని, తమ విజ్ఞాన, వివేకాలు తెచ్చిపెట్టిన సంస్కారంతో వాళ్ళు నిలదొక్కుకో గలిగారు.

'...నువ్వు పెళ్ళికూతురివైతే చూడాలని ఎన్నాళ్ళనుంచో కలలు కన్నాను రాధా! ఇప్పటికి నా కలలు నిజమయ్యాయి!'



అన్నాడు వేణుగోపాల్.

'...కళ్లంత చేసుకొని చూడకండి... దృష్టి తగులుతుంది పెళ్లి కూతురికి...' అంది మాధవి నవ్వుతూ.

'అన్నయ్య దృష్టి చెల్లెలికి తగలదు.' అన్నాడు అతను.

అలా కొంతసేపు పరిహాస ప్రసంగా లయ్యాక ఒక చిన్న కేస్ తీసి, 'నీకు పెళ్లి కానుక రాధా!' అంటూ నా చేతిలో పెట్టాడు వేణుగోపాల్.

ఆ కేస్ తను లాక్కొని తెరిచింది మాధవి. తళ తళలాడుతున్న రాళ్ల నెక్లెసు బయటకు తీసింది. ఆమె ముఖం వికసించింది. కాని, నేను తెల్లబోయాను. '...మీ అభిమానం చాలదా డాక్టర్! ఎందు కింత ఖరీదుపెట్టి తెచ్చారు...' అన్నాను.

'అభిమానాని కెవ్వరూ విలువ కట్టలేరు రాధా! కాని, ఆ అభిమానానికి చిహ్నంగా సమయం వచ్చినప్పుడు ఒక చిన్న కానుకను అర్పించుకుంటారు. అంతేనమ్మా! ... మీ అనురాగం పొందిన భాగ్యం ముందు...ఈ నెక్లెసు వెల ఏపాటిది...'

అతని కళ్లు ఆర్ద్రత చెందాయి. నా మనస్సు మూగవోయింది.

'పెళ్లికాకుండానే అన్నయ్య కానుక ఇచ్చే స్తున్నాడే!' అంది మాధవి ప్రస్తావన మారుస్తూ.

'అన్నయ్యలు పెట్టవలసినవి పెళ్ళికి ముందు కొన్ని, తర్వాత కొన్ని ఉంటాయి...'

'నీవనే బాగుందే రాధా!...నాకిలా నక్లె సులు పెట్టే అన్నయ్యుంటేనా ... ఈ పాటికి...'

'...మెడనిండా అమ్మవారిలా వేసుకునే వారు కదూ!...అప్పుడు మేము దడుచుకొని దేవతకి కొబ్బరికాయ కొట్టాలి...'

'...ఏం? నేను అమ్మవారిలాఉన్నానా?...' అన్నది మాధవి బుంగమూతి పెట్టి.

'...ఉండండి. అలాగే...కదలద్దు. ఒక మంచి ఫోటో తీసుకోవాలి...' అంటూ గబ గబ తన సూటుకేసులోని కెమేరా తీశాడు అతను. మాధవి ఫక్కున నవ్వింది.

'...నేనొక మంచి కెమేరా కొన్నానని నీకొకసారి వ్రాసాను గుర్తుందా రాధా! అదే ఇది...'

నా మెడలో డాక్టరు కానుకగా ఇచ్చిన నెక్లెసు అలంకరిస్తోంది మాధవి. అద్దంలో ఇనుమడించిన నా అందాన్ని చూసుకొని మురిసిపోయాను. రకరకాల భంగిమల్లో నాకు కొన్ని ఫోటోలు తీశాడు అతను. తను అతన్ని పరిహాసంచేసి కొన్ని ఫోటోలు తీయించుకుంది మాధవి.

అతన్ని కూడ పెళ్ళికొడుకుని చేసినట్లు వేణుగోపాల్‌కి చెప్పి అతన్ని చూపించటానికి తమ ఇంటికి తీసుకొని వెళ్ళిపోయింది మాధవి.

వేణుగోపాల్ మొట్ట మొదట వ్రాసిన ఉత్తరం అందిన నాటి మధుర భావనలు గుర్తుకు వచ్చాయి...

పెళ్లికుమారుని పరిహాసానికి సిగ్గు మొగ్గలేసి పెళ్లికుమార్తె బుగ్గలెరుపెక్కాయి. గబుక్కున ఆ బుగ్గల్ని ముద్దిడుకోవాలనిపించింది..,కాని, అద్దంలోని అనూరాధ బుగ్గల్ని ముద్దు పెట్టుకోవటం ఎలా? పెదవులు మాత్రమే అందాయి!... ఎవరి బుగ్గల్ని వాళ్లు ముద్దు పెట్టుకో గలిగితే ఎంత బాగుండును?...

నాటి మధురోహలలోని పిచ్చికోరికలు గుర్తుకు వచ్చి నవ్వుకున్నాను.

ఆ రాత్రి ఎంతసేపటికీ నిద్రపట్టలేదు. తీయని కోరికలను నింపుకున్న మనస్సులో ఏదో తెలియని అలజడి బయలుదేరింది. భావోద్వేగానికొక రూపం లేకుండా చేసింది. కొద్దిగా తలనొప్పి కూడ వచ్చింది...

నేను పక్కమీద అటు ఇటు పొర్లటం చూసింది కాబోలు!' 'అమ్మడూ! ఇంకా నిద్రపోలేదామ్మా!...' అని అడిగింది బామ్మ.

ఏం చెప్పాలో తెలియక, 'కొద్దిగా తల నొప్పిగా ఉంది బామ్మా!' అన్నాను.

ఆవిడ అమాంతంగా లేచి వచ్చి, 'భయపడ తూనే ఉన్నాను ... అనుకున్నంత పనీ జరిగింది.' అని ఉప్పు తీసుకు వచ్చి దిష్టి తీసేసింది. '...ఇక పడుకోమ్మా! నిద్ర పోకపోతే ఆరోగ్యం పాడవుతుంది.' అని నా జుట్టు నిమిరి వెళ్లి పడుకుంది ఆవిడ.

నా కళ్ల నీళ్లు తిరిగాయి. కష్టాల్లో కరడు కట్టిన హృదయం కన్నీటిని ఇగిర్చి వేస్తుంది. సుఖాల్లో సంతృప్తిని నించుకున్న ఆ హృదయమే సున్నితమైన అనుభూతికి కూడ కన్నీటిని చిప్పిల జేస్తుంది.

గతానుభూతుల వ్యథాభారాన్ని దించుకున్న నా కనురెప్పలు కమ్మని భావాలతో బరువెక్కాయి. నాకు తెలియకుండానే నిద్రలోకి జారిపోయాను.

* * *

పెళ్లి శుభలేఖ లందుకున్న బంధువులు ఒక్కరొక్కరే దిగుతున్నారు. ఇంటికి నిండుతనం వచ్చింది. గుమ్మాలకు పెట్టిన పసుపు కుంకుమలు కళకళలాడు తున్నాయి. వందిట్లోని మామిడాకుల తోరణాలు వింత అందాన్నిచ్చాయి.

మధ్యాహ్నం మాధవితోపాటు వేణుగోపాల్ వచ్చి కొంతసేపు కబుర్లు చెప్పాడు. తను త్వరలో ప్రయివేటుగా ప్రాక్టీసు మొదలు పెట్టాలనుకుంటున్నానని మరి కొందరు మిత్రులు ప్రోత్సహిస్తున్నారని చెప్పాడు. మావూరులాంటి ఊళ్లో అయితే ప్రాక్టీసు బాగా పెరుగుతుందన్నాడు.

పేదల నాదరించాలని అందరినీ ఆదుకోవాలని అతని కోరిక. కాని, అతడే చిన్న ఊళ్లో ప్రాక్టీసు పెట్టినా అక్కడి చిన్న డాక్టర్లకది దెబ్బ. నాన్నగారివంటి డాక్టర్లని దృష్టిలో పెట్టుకొని అలా అన్నాడు. అతని విశాల హృదయానికి మనస్సులో అంజలి ఘటించాను.

కొంతసేపుండి అతను, మాధవి వెళ్లి పోయారు.

పిన్ని ఏదో పనిలో ఉంటే పాపాయి నాడిస్తున్నాను. రవి చంటి పిల్లాడుగా ఉన్నప్పుడు వాడిని ఇలాగే ఆడిస్తుండేదాన్ని. గతంలోకి మనస్సు పరువెత్తింది. అమ్మ గుర్తుకు వచ్చింది. ఈ శుభ ఘడియలో ఆమె ఉంటే ఎంత నిండుగా ఉండేది! కళ్ళ నీళ్ళు తిరిగాయి. మూగ బాధతో అలా కూర్చుండి పోయాను.

పాపాయి ఎప్పుడో నిద్రపోయింది. వాకిట్లో బంధువులు భోజనాలకు కూర్చున్నారు. వాళ్ళ కబురస్థాయి పెరిగి పాపాయికి నిద్రాభంగం కాకూడదని గది తలుపులు దగ్గరగా వేసాను.

పదినిమిషాలు గడిచాయో లేదో ఇంతలో చటుక్కున దీపాలు ఆరిపోయాయి. చుట్టూ గాఢాంధకారం. ఆర్డరు ఇచ్చిన పెట్రొమాక్సులైట్లు రాకపోవటంతో ఒక్కటీ ముందుగా వెలిగించి ఉంచుకోటానికి వీలు లేకపోయింది. ఆమధ్య రెండు మూడుసార్లు

# మీ తలనొప్పి అంతా

తలనొప్పి
మానసిక ఆలసట, వ్యాకులత
ఇత్యాది అసౌఖ్యముల
కల సమయములలో వస్తుంది

తలనొప్పి
చుట్టు ప్రక్కల సద్దు
వలన వస్తుంది

తలనొప్పి
ముక్కు దిబ్బడ పడిశము
జలుబు వలన వస్తుంది

తలనొప్పి
విపరీతమైన ఎండ వలన
వస్తుంది

తలనొప్పి
కళ్ళ అలసట, ఎంతో సేపు
రాత్రి చదువుట వలన
వస్తుంది

తలనొప్పి
కళ్ళ అలసట, ఎంతో సేపు
కుట్టుపని వలన వస్తుంది

# ఒకే ఒక సారిడన్ తో

ట్రేడ్ మార్కు 'రోష్'

# మటుమాయమై పోతుంది

మీకు ఏ కారణము వల్ల తల నొప్పి వచ్చినా సారిడన్ దగ్గర వుంచుకోండి. మీకు తల నొప్పి, ఒళ్ళు నొప్పి, పళ్ళ నొప్పితో బాటు వుండే జ్వరమును లేక అసౌఖ్యము కలిగిన రోజులలో వుండే బాధను పోగొట్టి, హాయి నవోత్సాహములను కలిగించుటకు సారిడన్ ప్రత్యేకంగా సూత్రీకరింపబడినది. అదే సారిడన్ ప్రత్యేకత-అది మిమ్ము చురుకుగా, ఉత్సాహముతో వుంచును.




ఒకే ఒక సారిడన్ చాలును
'రోష్' తయారీ

**సారిడన్ ఉపశమనమును, నవోత్సాహమును, హాయిని కలిగించును.**

లైట్లన్నీ పోవటం ఐదారు నిమిషాల్లో రావటం జరిగింది. అదే ఆశతో కదలకుండా కూర్చున్నాను...చీకటికి పాపాయి లేస్తుందేమోనన్న భయం నన్ను గది తలుపు తెరవటానికి కూడా కదలనివ్వలేదు. వాకిట్లో నాన్నగారి గొంతు వినిపించింది. 'ఎక్కడి వాళ్ళక్కడే కూర్చోండి హరికేన్ లాంతర్లకి పంపాను.'

బంధువులంతా చీకటి గురించి ఎవరి కబుర్లలో వాళ్ళున్నారు. ఇంతలో దొడ్డి వైపు గుమ్మం నుంచి ఎవరో లోపలికి రావటం లీలగా కనిపించింది.

'ఎవరూ?' అన్నాను. చీకట్లో దేని మీదైనా పడతారని.

'ఎవరు రాధా?' ఏదో అపరిచిత కంఠంలా ఉంది.

'అవును...' ఎవరై ఉంటారో అని ఆలోచించేలోపలే ఆ వ్యక్తి గబుక్కున నా దగ్గరకు రావటం నా నోరు మూసి గుడ్డతో గట్టిగా నోరు కట్టేయటం జరిగింది. భయకంపితురాలనై గట్టిగా అరవాలనుకున్నాను. కాని నోటికడ్డంగా కట్టు ఉంది. ఏం చేయను? ఆ వ్యక్తి నా చేతులు విరిచి వెనక్కి పట్టుకున్నాడు. నా మెడలోని నగను దొంగిలించాలని వచ్చిన దొంగేమో అనుకున్నాను.

కాని, నా చెవి దగ్గరగా అతని ఉద్రేక పూరిత స్వరం భయంకరమైన నిజాన్ని

## రాగధార

చెప్పింది. 'రాధా! ఒళ్ళలగ్గానే పెండ్లిక కాదని చెప్పిన మాట గుర్తుందా? ఇప్పుడు నీ మాస్టరుకాదు కదా దేవుడుకూడ నిన్ను కాపాడలేడు...'

తాచుపాము పగబట్టినా కొన్నాళ్ళకు అది పట్టు విడుస్తుందని అంటారు.

కాని! రాజారావు కాలనాగువంటి వాడని నేనెప్పుడూ ఊహించలేదు. ఇంత ధైర్యంగా ఇంతమంది ఉండగా ఇంటిలోకి చొరబడి నన్ను నాశనం చేయటానికి వచ్చాడంటే ఎంతకి తెగించి వచ్చాడో మరి! అప్పటికి ఈ లైట్లు ఆరిపోవటానికి కారణం నాకు అర్థమయింది. గాలివానలో చిగురుటాకులా కంపించి పోయాను. సముద్రంలో తుఫానులో చిక్కుకున్న నావలా కృంగిపోయాను. కుప్పలా కూలిపోయాను.

'...రాధా! నీకోసం నా సర్వస్వాన్ని వదులుకుందా మనుకున్నాను. నన్ను పిచ్చివాడిని చేసి ఆడించావు నన్ను రాక్షసుడిని చేసావు. నాకు దక్కని నిన్ను ఇంకెవడికీ దక్కనివ్వను. నువ్వు ఏమయినా నా దానివి కావాలి...అంతే! ఏమయినా సరే!...' అతని మాటలు నా చెవుల్లో తుపాకి గుళ్ళలా వినిపించాయి. నన్ను కాపాడమని వేడుకుందా మనుకున్నాను. ఎవరినైనా రక్షించమని అరుద్దా మనుకున్నాను. ఏదీ చేయలేక పోయాను. నా నోరు కట్టేసాడు. నా చేతులు వెనక్కి విరిచి కట్టేసాడు ... రాజారావు! కాదు...నా పాలిటి యముడు.

వాకిట్లో అంతా తమ కబుర్లలో మునిగి పోయారు ... కాని, ఏ పెళ్ళికూతురిని తాము పెళ్ళిపందిట్లో చూద్దామని వచ్చారో ఆ అమ్మాయిని ప్రక్క గదిలోనే ఒక దుర్మార్గుడు సమాధి చేస్తున్నాడని వాళ్ళకు తెలియదు. నేనెంత దురదృష్టవంతురాల్ని! పూవులాంటి బ్రతుకును క్షణంలో బూడిద చేయగల శక్తి విధి చేతిలో ఉంది. అవును నేను విధి చేతిలోని కీలుబొమ్మను. నిస్పృహతో క్రుంగి పోయాను.

నాకు స్పృహ తప్పినంత పనయింది. '...పెళ్ళికూతురి గదిలోకి ఒక లాంతరు పంపండి!' అని ఎవరో అనడం వినిపించింది. వెంటనే రాజారావు నన్నమాంతంగా పైకెత్తుకొని దొడ్డివైపు బయటకు తీసుకొని పోయాడు. వీధివైపు చీకటిగా ఉంది అక్కడెవరూ లేకపోతే అతడు నన్నవలీలగా వెనక సందులోంచి ఎక్కడికైనా తీసుకుపోగలడు. ఆ తర్వాత నా బ్రతుకేమవుతుందో నేనూహించనవసరం లేక పోయింది.

ఇంతలో నాన్నగారు, 'అమ్మడూ!... ఎక్కడున్నావమ్మా!...' అని పిలవటం వినిపించింది. ఆఖరి ఆశతో లోప్రాణం కూడదీసుకొని గిలగిల తన్నుకున్నాను. అంతే బలవంతుడైన రాజారావు చేతుల్లోంచి బొంగరంలా దొర్లి క్రింద పడ్డాను...ఎముకలు విరిగినట్టుయింది.

'ఏమిటది...' నాన్నగారి కంపిత కంఠం వినిపించింది.

అంతే! '...నువ్వే గెలిచావు కాని నిన్నా మాస్టరికి దక్కనివ్వను రాధా!...' అన్న తుది వాక్యంతో తన పగ సాధించుకున్నాడు రాజారావు. ఏదో పదునుగా వచ్చి నా తలకు కొట్టుకుంది. 'అమ్మా!' అని సర్వశక్తులు కూడదీసుకొని గట్టిగా అరిచేశాను. కాని నా గొంతు నాకే వినిపించ లేదు. నా తల బద్దలయి నేను చచ్చి పోయాననుకున్నాను. నాకు స్పృహ తప్పి పోయింది!

* * *

స్త్రీ అనురాగం ఒక వ్యధిత హృదయుని






హృదయంలో స్వాతివాన కురిపిస్తే, మరొక అసూయాపరుని హృదయంలో బడబాగ్ని రగిల్చింది. ఆమె సౌందర్యాన్ని ఆరాధించి ఒక వ్యక్తి దేవుడయితే, అహంకరించి దౌర్జన్యంగా అనుభవించాలని రెండవ వాడు దానవుడయ్యాడు.

ఆ స్త్రీని నేనే కావటం నా దురదృష్టం. ఒకనిని దేవుని, రెండవ వానిని దానవుని చేసిన నా సౌందర్యం, నా అనురాగం వ్యక్తిగతంగా నన్నెంత వరకు బాధ్యురాలిని చేసాయో నాకు తెలియదు. సంపూర్ణత్వను సాధించుకున్న సహృదయునికి మనసిచ్చిన నేను అహం—అసూయలతో క్రుమ్మి మసిబారి పోయిన ఒక అహంకారికి ఎలా లొంగిపోగలను? నిస్సహాయస్థితిలో అతని దౌర్జన్యానికి బలి అయిపోయానే కాని నన్ను నేను నాశనం చేసుకోలేదు. పవిత్రాత్మతో మృత్యువునే ఎదుర్కొన్నాను. అదే నాకు ఆత్మ తృప్తి.

రాజారావు దారుణ కృత్యానికి గురియై అలా ఎంతకాలం స్పృహ కోల్పోయి ఉన్నానో నాకు తెలియదు. అసలు తిరిగి బ్రతుకుతానని కూడ నేననుకోలేదు.

కాని, నేను బ్రతికాను!

స్పృహలోకి వచ్చేసరికి తల పగిలిపోతున్నంత పోటు — కదలలేనంతగా ఒళ్ళంతా బిగపట్టేసినట్లు నొప్పులు — బాధగా మూలిగాను. చైతన్యం కళ్ళు తెరిపించేసరికి విస్మయం కలిగింది. హాస్పటల్లో ఉన్నాను నేను. అది గ్రహించటానికి క్షణం పట్టలేదు. నా బెడ్ చుట్టూ అంతా ఆత్రుతగా నా వైపు చూస్తూ నిలబడి ఉన్నారు.

బయట బాగా వెలుగుంది. అంటే... నేను చాలసేపు స్పృహ తప్పి పడి ఉన్నానన్నమాట! రాత్రి జరిగిన దుస్సంఘటన గుర్తుకు వచ్చింది. క్షణంపాటు కంపించిపోయాను. బిత్తరగా ఏమయిందో గ్రహించాలని చుట్టూ చూసాను.

డాక్టర్లు, నర్సులు, వేణుగోపాల్, మాధవి, నాన్నగారు, రాఘవరావుగారు, బొమ్మ...అంతా నా చుట్టూ నిలబడి ఉన్నారు. కాని, అతను లేడు! నాకింత ప్రమాదం తప్పిందని ఆనందించవలసిన వ్యక్తులలో ముఖ్యుడు...అతడు లేకపోవటం నాకు మరింత బాధ కలిగించింది. పెళ్ళికుమారుడు కనుక కనిపించకూడదన్నారా

# కొన్ని సామాన్య వ్యాధులకు పథ్యాపథ్యములు

## క్షయరోగ పీడితులకు

**పథ్యములు:—** క్షయ వ్యాధిగలవారు గోధుమ అన్నం, గోధుమ రొట్టెలు, మంచి పాత బియ్యపు అన్నం తినవచ్చును. పెసర పప్పు, సెనగపప్పు, కందిపప్పు, పొరపప్పు— వీనికట్లు తినవచ్చును. కఫాన్ని పెంచే కూరల్ని మినహాయించి తక్కిన కాయగూరల్ని, ఆకు కూరల్ని దుంపకూరల్ని తినవచ్చును. మేక మాంసం, అడవి మృగ పక్షుల మాంసములు తినవచ్చును. రోజూ రెండు పూటలా మంచి పాలు త్రాగుతూండాలి. ఉదయం వేళ పాలలో కోడిగ్రుడ్డు సొన కలుపుకొని త్రాగడము మంచిది. రొట్టెలకు వెన్నగాని నెయ్యిగాని రాసుకొని తినవచ్చును. పచ్చి ద్రాక్ష, అరటి, సొగడ, మామిడి, ఖర్జూర, ఉసిరిక, పనస పళ్ళు తింటూంటే యీ రోగం కొంతవరకూ తగ్గుతుంది. ద్రాక్షాసవం తగుమోతాదులో తీసుకోడం వల్ల కూడా ఈ రోగం కొంచెం తగ్గుతుంది. ఖండశర్కరతో చేసే మధుర పదార్థాలు మధురరసాలు యీ రోగం గలవారికి పథ్యమైనవే. ఈ రోగులు మంచి వాయుప్రసారము గల గదిలో బాగా విశ్రాంతి తీసుకోవాలి.

**అపథ్యములు:—** క్షయవ్యాధి గలవారు కరుబూజా, పంపరపనాస, నారింజ మొదలగు శీతల ఫలాలు తినకూడదు. క్రొత్త బియ్యపు అన్నం, చల్లన్నం తినకూడదు. దొండ, బెండ, దోసకాయల కూరలు తినకూడదు. కూరలలోను, పచ్చళ్ళలోను పులుపు కారం బాగా తగ్గించాలి. చల్లటి మజ్జిగ, పెరుగు అన్నంలో కలుపుకొని తినరాదు, త్రాగరాదు. అమితంగా భోంచెయ్యకూడదు. గొర్రె మాంసం తినకూడదు. మలమూత్ర వేగాన్ని నిరోధించ కూడదు. కష్టమైన పనులేవీ చెయ్యకూడదు. సంచారం చెయ్యకూడదు. గాలి తగలని చీకటి గదులలో నివసించ కూడదు. జాగరం చెయ్యకూడదు.

## కుష్ఠురోగులకు

**పథ్యములు:—** కుష్ఠురోగం గలవార్కి గోధుమ అన్నం, పాత బియ్యపు అన్నం, పాతబార్లీ బియ్యపు అన్నం తినవచ్చును. పెసర పప్పు, మసరపప్పు, కందిపప్పు— వీనికట్లు అన్నంలో కలుపుకొని తినవచ్చును. మేక మాంసం అడవి మృగ పక్షుల మాంసములు తినవచ్చును. బీరకాయకూర, పొట్లకాయకూర, ఉస్తికాయకూర, నేల ములగకాయకూర, కాకరకాయకూర, ఆగాకరకాయకూర, పెరుగుతోటకూర, తెల్లగలిజేరుకూర, తంటెపుకూర, పద్దికూర, ఉస్తికూర, కాచిఆకు కూరలు తినవచ్చును. కొర్రలు, చామలతో చేసే పదార్థాలు తినవచ్చును. ఆవనూనె వాడవచ్చును. వెల్లుల్లి, నీరుల్లిపాయలు తినవచ్చును. జీడిపళ్ళు, తాటిపళ్ళు తినవచ్చును. పాత నెయ్యి వేసుకొనవచ్చును.

**అపథ్యములు:—** కుష్ఠురోగులు తాము తినే ఆహార పదార్థాలలో పులుపు, ఉప్పు, కారం బాగా తగ్గించెయ్యాలి. అంటే పులుపు, ఉప్పు, కారం అధికంగాగల పదార్థాలు తినకూడదు, పాలు త్రాగకూడదు. పెరుగన్నం తినకూడదు. నువ్వుల పచ్చడి, నువ్వుల గుండ, నువ్వుల ఉండలు, నువ్వుల పప్పు వేసి వండే పదార్థాలు తినకూడదు. నూనె పిండి వంటలు తినకూడదు. అన్నంలో నువ్వుల నూనె వేసుకొని తినకూడదు. మినప్పప్పుతో చేసే పదార్థాలు తినకూడదు. చెరకుగడలు తినకూడదు. చెరకు పానకం త్రాగకూడదు. చేపలు తినకూడదు. నీటిపక్షులు, కోడి, పావురం వీని మాంసములు తినకూడదు. వ్యాయామం, మైథునం మానెయ్యాలి.

సేకరణ: ఆకుండి నారాయణమూర్తి

పెద్దవాళ్ళు? నా ఆటువంటి సమయంలో కూడ ఈ బంధనాలా?

'అమ్మా!' అని మూలుగుతూ కళ్ళు మూసుకున్నాను.

'ఇంక ఫర్వాలేదు. ఆమెకు తెలివి వచ్చింది' అని ఎవరో అన్నారు.

'ఆమెకు విశ్రాంతి కావాలి. దయయుంచి అంతా బయటకు వెళ్ళండి...' అని ఇంకొకరన్నారు.

నేను బాధగా కళ్ళు తెరచి, 'వద్దు. ఉండండి...నన్ను విడిచి వెళ్ళిపోవద్దు...' అన్నాను. నా గొంతు నాకే హీనంగా వినిపించింది.

'అమ్మడూ! ఎలా ఉందమ్మా...' అంటూ బామ్మ దగ్గరగా వచ్చింది. ఆమె కన్నీళ్ళు చూసేసరికి నాకు దుఃఖం పొంగి వచ్చింది. వాళ్ళని కంగారు పెట్టకూడదని బలవంతంగా దిగమింగుకున్నాను.

'నాకేమయింది?...' అన్నాను.

'చిన్న దెబ్బ తగిలింది. ఇప్పుడు నువ్వు పూర్తిగా విశ్రాంతి తీసుకో రాధా! తర్వాత అన్నీ వివరంగా చెప్తాను...' అన్నాడు వేణుగోపాల్. '...మనమంతా బయటకు వెడదాం పదండి.' అతని వెనకనే అంతా బయటకు వెళ్ళిపోయారు. నాన్నగారు బాగా నీర్సంగా కనిపించారు. నోరు విప్పితే దుఃఖం పొంగివచ్చేలా ఉంది. అతను కనిపించకపోవటం ఒకమూల బాధగా ఉంది. తల బద్దలయి పోయినంత నొప్పిగా ఉంది. తలమీద పెద్ద బరువుగా ఉంది. పెద్ద ప్రమాదం తప్పిందన్నమాట! బలవంతంగా కళ్ళు మూసుకున్నాను.

నర్సు వచ్చి నెమ్మదిగా తట్టి నాచేత టాబ్లెట్ మ్రింగించింది. తెల్లని దుస్తుల్లో ఆమె అందంగా మల్లెపువ్వులా ఉంది. నా బుగ్గలు నిమిరుతూ, '...కమ్మని కలలు కంటూ కాసేపు కన్ను మూయ్యి రాధా!' అంది నర్స్.

'కలగిన హృదయంలో కమ్మని కలలు కనే శక్తి లేదు సిస్టర్!' అన్నాను.

'తప్పు. అలా అనకూడదు. చంద మామను మరుగు పరచాలని మబ్బులు కాసేపు తాపత్రయ పడతాయి. తర్వాత మబ్బులు ఎలాగూ తొలగిపోక తప్పదు. వెన్నెల వెల్లివిరియకనూ తప్పదు. మరి నామాట విని కాసేపు నిద్రపోవూ!' అని

# రా గ ధా ర

చిరునవ్వులు చిలకరించి ఆమె చిచ్చికొట్టి వెళ్ళిపోయింది. నాకళ్ళు చెమర్చాయి.

ఆ నిస్సత్తువలోనే కొంతసేపు నిద్ర పోయాను. మెలకువ వచ్చేసరికి ఎదురుగా నా ముఖంలోకి తదేకంగా చూస్తున్న మాధవి కనిపించింది. నా నెచ్చెలిని చూసిన ఆనందంలో నా శారీరక బాధలన్నీ పటాపంచలయి పోయాయి.

'మధూ!'

'అనూ!' అని ఒక్క పరుగున వచ్చి నా చేతిని పెనవైచుకొని కన్నీరు పెట్టింది ఆమె. బరువెక్కిన నా మనస్సు బండగా తయారయింది.

కొంతసేపటికి తేరుకున్న మధూ, '...ఇప్పుడెలా ఉంది అనూ!' అని అడిగింది.

'తల నొప్పి తగ్గింది కాని ... బాగా నీర్సంగా ఉంది.'

'ఉండదూ మరి నీకిది పునర్జన్మ, మా ప్రాణాలరచేతిలో పెట్టుకుని ఇంత సేపు గడిపాము...'

'నాకే మయింది...'

'తర్వాత చెప్తాను. ముందు నీకు కులాసా చిక్కితే నా మనస్సు కుదుట పడుతుంది...'

'ఆయన, వేణుగోపాల్ ఏరి?'

'ఎవరికీ రాత్రంతా నిద్రలు లేవుకదా! అంతా విశ్రాంతి తీసుకుంటున్నారు... ఈ నర్సులు బలే చలాకీగా ఉంటారు కదూ!' అంది మాధవి ప్రస్తావన మార్చేస్తూ.

ఇంతలో గోమతి, పద్మ వచ్చారు. మెట్రిక్ పరీక్షలు వ్రాయటానికని పట్నం వచ్చి వాళ్ళింట్లోనే వారం రోజులున్నాను. వాళ్ళకు నాకు జరిగిన ప్రమాదం విషయం తెలిసిందట. చూసి పోదామని వచ్చారు. కొంతసేపు కబుర్లు చెప్పి వాళ్ళు వెళ్ళి పోయారు. ఈలోపల నర్సు వచ్చి రెండు సార్లు హెచ్చరించింది మాధవిని— నన్నెక్కువ మాట్లాడించ వద్దని.

'...ఒక్కోసారి ఈ సిస్టర్లు ఎంత మంచివాళ్ళో ... మరోసారి అంత చెడ్డ వాళ్ళయిపోతుంటారు. మనసారా మాట్లాడు కోనివ్వరు కదూ!' అన్నాను చిరుకోపంతో.

'మాధవి నిస్సత్తువగా నవ్వింది. 'మీ ఆరోగ్యంకోసమే వాళ్ళ తాపత్రయం.'

నర్సు వచ్చి లైట్లు వేసింది. నాన్నగారు, రాఘవరావుగారు, బామ్మ లోపలికి వచ్చారు. వాళ్ళతోపాటు వచ్చిన డాక్టరు నాకో ఇంజక్షను ఇచ్చారు. అప్పటికే బాగా చీకటి పడింది.

'రాధమ్మా! నీకు సాయంగా మధూ ఇక్కడ ఉంటుంది. నేను నిన్న రాత్రనగా వచ్చి ఇంతవరకు ఇంటికి వెళ్ళలేదు. ఇంటి నిండా చుట్టాలున్నారు. వాళ్ళ సంగతి చూసుకోవాలిగా...మరి నేను ఇంటికి వెళ్ళిరామా!' అన్నారు రాఘవరావుగారు.

తల పంకించాను. బామ్మ బొంగురు పోయిన గొంతుతో, నా ఒళ్ళు నిమిరుతూ, 'ఏది ఏమయినా నువ్వు బ్రతికి బయట పడ్డావు. అంతే చాలు. మళ్ళీ రేపొ ఎల్లుండో వస్తానమ్మా! మాధవి ఉందిగా! రాజుని ప్రొద్దున్నే నాన్న పంపుతాడు...' అంది.

'నువ్వెళ్ళిరా బామ్మా! నాకేం ఫర్వా లేదు ..' అన్నాను చిరునవ్వు తెచ్చుకుంటూ.

నాన్నగారు నా దగ్గరకి రాలేకపోయారు. ఆయన వస్తే ఏమవుతుందో నాకు తెలుసు. ఈ స్థితిలో నా కన్నీళ్ళు నా హృదయ భారాన్ని తగ్గించినా నా వాళ్ళ గుండెల్ని చీల్చుతాయి. అదీ నా భయం!

వాళ్ళంతా వెళ్ళిపోయారు. 'ఆయన రాలేదు...' అన్నాను.

మధూ మాట్లాడలేదు.

'మధూ! మాట్లాడవేం?...'

'ఆఁ!...ఏదో ఆలోచిస్తూ నీ మాట వినలేదు...చెప్పు.'

'మాస్టారు, వేణుగోపాల్ ఎక్కడకు వెళ్ళారు.'

'రాత్రంతా నిద్ర లేదు కదూ! వాళ్ళు హోటలుగదికి వెళ్ళారు. రేప్రొద్దున్నే వస్తారు...'

ఇంతలో నర్సు వచ్చింది. బన్ రొట్టె ముక్కలుగాచేసి నాచేత తినిపించసాగింది. మాధవి భోజనంచేసి వస్తానని చెప్పి వెళ్ళి పోయింది. నాకు నిద్ర పట్టటానికి నర్సు మందు ఇచ్చింది కాబోలు! మాధవి ఎప్పుడు వచ్చిందో నాకు తెలియదు. అప్పటికే నేను గాఢ నిద్రపోయాను.

(ఇంకా ఉంది)

# తిరుపతికి ప్రయాణం




బొందల నాగేశ్వరరావు

మద్రాసు సెంట్రల్ బుక్కింగాఫీసింతా గందరగోళం. అసలు 'క్యూ' సిస్టమే సరిగ్గా లేదు. క్యూలో నిలబడ్డ పాతిక మంది పైపై బడుతున్నారు టిక్కెట్లకు.

ఇంకో మూడు నిముషాలకు తిరుపతి ప్యాసింజర్ పదకొండో ప్లాట్‌ఫారంనుండి బయలుదేరుతుందని అప్పటికే పదిసార్లకు పైగా అనౌన్స్ చేశారు.

'ఇక లాభం లేదు. నా ముందున్న ఆరుగురికి టిక్కెట్లు యిచ్చేలోపల రైలెళ్లి పోతుంది. ఇంతలో—ఇందులో—ఈ క్యూలో యెందరెన్ని టిక్కెట్లో! మరలా చిల్లర పంచి యివ్వాలి. అబ్బా! ఎలాగైనా ముందుకు పోతేనే ఈ రైల్లో తిరుపతికి చేరగలను' అనుకొంటూ ధర్మారావు బలవంతాన ఆరుగుర్ని నెట్టి తొలగేసుకొని అన్యాయంగా బుక్కింగ్‌లోకి పది రూపాయల నోటు పోనిచ్చాడు. 'ఏమండోయ్ తిరుపతి కో టిక్కట్టం'టూ.

బుక్కింగ్ క్లర్కు నోటునలా తిసుకొని టిక్కెట్టు, చిల్లర కిటికీగుండా బుసలు గొడుతూ బావురుపిల్లిలా లోనికి చూస్తున్న ధర్మారావు చేతిలో పెట్టాడు.

బుక్కింగ్ దగ్గరనుండి బలవంతంగా బయటికి దూసుకొని ఆ క్యూ వంక అదో విధంగా వ్యంగ్యధోరణితో, వీరస్వభావంతో ఓ చూపు విసిరాడు తనలో తానే గర్వ పడుతూ తనేదో సాధించినట్టు ధర్మారావు.

అందరూ, 'భలే పెద్దమనిషివే లేవయ్యా! అప్పం సినిమాలో రాజనాల గుణాలే నీలో అతికాయి' అన్నట్లు కోపంతో ఏహ్యంగా పళ్లికిలించి చూచి ముఖాలు విరిచారు.

జవాబుగా, 'క్షమించండి' అన్నట్టు రమణారెడ్డిలా నవ్వి నడక సాగించాడు పదకొండో ప్లాట్‌ఫారానికి.

పంచె వూడేట్టుంది. దాన్ని ఎడమచేత్తో పట్టుకొని ఎయిర్ బ్యాగ్‌ని కుడిచేత్తో ప్రక్కకు త్రోసుకొంటూ వాచీ చూచుకొన్నాడు. యింకో నిముషమే వుంది రైలు కదిలేందుకు. ఇప్పుడు పరుగు ప్రారంభించాడు పదకొండో ప్లాట్‌ఫారానికి.

ఫ్లాస్కు టపా, టపా కొట్టుకొంటుంది మెడలో. గుండె ధడా, ధడా మంటుంది సిగ్నల్ చూస్తుంటే. జర్రున జారాడు. 'అబ్బా...! పనికిరాని పిచ్చి వెధవలు అరటి

# వారఫలం

**28-7-1972 శుక్రవారం మొదలు**
**3-8-1972 గురువారం వరకు**

**మేషం:** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వారంమధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రద్ధ కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**మిధునం:** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో నూతన అవకాశాలు లభించగలవు.

స్త్రీలకు— సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం:** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. ఆందోళన కలుగుతుంది. వారంమధ్యలో అనుకూలత లభిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం:** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. పోటీదారిలో గౌరవం బాగుంటుంది. వారంమధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.

**కన్య:** వృత్తిలో పోటీదారి పోటీ పెరుగుతుంది. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీరు శ్రమ పడినా, ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. పోటీదారిలో గౌరవం బాగుంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం:** మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీకు ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. విలాస వస్తువులు కొంటారు.

**మకరం:** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సుఖవుగా నెరవేరతాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం:** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మీనం:** చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారంమధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్

# ఇవి మీకు శక్తినిచ్చే సంవత్సరాలు...








## ఓవల్‌టీన్ సంవత్సరాలు

ఓవల్‌టీన్ తీసుకుంటే మీరు మరింత ఆరోగ్యంగా, ఉల్లాసంగా, బలంగా, ఉత్సాహంగా వుంటారు. ఎందుచేతనంటే ఓవల్‌టీన పాలు, మాల్ట్‌లతో తయారైన పానీయం. మీకు ఆరోగ్యం, బలం, ఉత్సాహం ఇచ్చేందుకు దీనినిండా ప్రోటీనులూ, మరెన్నో విటమిన్‌లూ వుంటాయి. ఈ పానీయపు చక్కటి రుచి మీకు నచ్చుతుంది। అందువల్లే ప్రపంచంలో లక్షలాది ప్రజలు ఓవల్‌టీన్ త్రాగుతున్నారు. ఈ వేళే మీరుకూడా వారితో చేరండి।



**ఆరోగ్యానికి, బలానికి, శక్తికి**
**రుచికరమైన ఓవల్‌టీన్ సేవించండి**

లండన్‌కి చెందిన ఎ. వాండర్ లిమిటెడ్ అనుమతితో జగత్‌జీత్ ఇండస్ట్రీస్‌వారు భారతదేశంలో తయారుచేస్తున్నారు.
సోల్ డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్ లిమిటెడ్

ASP/JJT 6/72/A Tel

తొక్కాలు యిక్కడే పారెయ్యాలి... మనసు లోనే గొణుక్కొన్నాడు.

గార్డు విజిల్ యిచ్చాడు. 'అబ్బో...! రైలెళ్లిపోయేలా వుందే...' లేచి కుంటుతూ మూడడుగులు వేశాడోలేదో వెనుకే వస్తున్న ఓ అమ్మాయి యెక్కడో చూస్తూ స్లిప్పర్ తొక్కేసింది. పడబోయి తమాయించుకొని నిలబడ్డాడు ధర్మారావు.

'సారీ సార్' అంటూ స్లిప్పర్ తెగింది కూడా సరిగా చూడకుండ ముందుకెడుతూ వుందావిడ.

'నెవర్ మైండ్' విధిగా అనేసి తెగిన స్లిప్పర్ యిక లాభంలేదని అక్కడే వదిసి 'నాలుగుంబుప్పావలా నష్టపెట్టిందా నవ నాగరిక నగిషీ బొమ్మ'ని ఓ ప్రక్కనుకొని 'పర్వాలేదులే అమ్మాయే కదూ' అని మరో ప్రక్క మురిసిపోతూ నడిచాడు.

గార్డు పచ్చ జెండా వూపుతున్నాడు. వెనక్కు తిరిగి చూస్తే తెలిసింది. ఎదురుగా వడివస్తున్న పోర్టర్ నెత్తిన బెడ్డింగు వుండడంతో ముందు సిగ్నల్ కనబడలేదిప్పుడు. ఇంకో రెండడుగులు దాటుతూనే కాఫీ స్టాల్ అడ్డొచ్చిపడింది. అక్కడ ఆత్రుత్తుంగా కాఫీ తాగుతున్న వ్యక్తిని గుద్దుకోడంతో కోటు తడిసిపోయింది. 'ఏంటయ్యా! ప్రక్కగా నిలబడి తాగుతదూ' విసుక్కొన్నాడు ధర్మారావు. తుడుచుకొంటూ నడిచాడు.

ముందు రైలు కూతేసి కదిలింది—

'హమ్మయ్య' ఇనుపచువ్వ పట్టుకొని లోపల కాలు పెట్టాడు.

'బాబూ కొద్దిగా సర్దుకొంటారా

# తిరుపతి ప్రయాణం

కూర్చొంటాను' నల్లగా, లావుగా, ఎత్తుగా, గళ్ళుచొక్కాతో, టైటు పాంటుతో కిటికీ వద్ద పెద్ద దయ్యంలా దొంగ చూపులు చూస్తూ యెదురు సీటు మీద కాళ్ళుంచుకొని సిగరెట్టు దమ్ములాగి వదులుతున్న తన్ని అర్థించాడు ధర్మారావు.

'లేదు పోవయ్యా! అదింకో మనిషిది' గుడ్లురిమి చూచి విసుక్కొన్నాడు గళ్లచొక్కావాడు.

చూచిన ఆ చూపుల్లో 'మరోసారి అడిగితే నీపీక నులిమిపారేస్తాను'అన్నట్లుంది ధర్మారావుకి.

'క్షమించు బాబూ నేనలా కూర్చొంటానులే' ఆయన భయపడ్డాడు.

గళ్లచొక్కావాడు అంతకుముందే తెలుగులో యింకోకనితో మాట్లాడుతుంటే విని సీటిస్తాడన్న నమ్మకంతో అడిగాడు ధర్మారావు. గళ్లచొక్కావాడలా విసురుకొంటాడని తెలిసివుంటే అసలు నోరు కూడా తెరచేవాడు కాదాయన.

గుక్క వదలకుండా తాగుతున్న సిగరెట్టు పొగ తనచుట్టూ చుట్టుకోడంతో ఎడమ చేత్తో విసురుకొంటూ ప్రక్కకు తొలగి క్రిందే కూర్చొనివున్న ముసలాడి కర్ర తట్టుకొని పడబోయాడు. సిగరెట్టు పొగతో పోటీపడుతున్నట్లు చుట్ట పొగ వదులుతున్న ముసలాడు 'చూసెళ్లండి బాబయ్యా'ని ప్రక్కకు తిరిగి కిటికీలోకి వుమ్మివేశాడు. అది గళ్లచొక్కా వాడిమీద పడింది.

'బతికించావ భగవంతుడా! విలాగో వుమ్మి నామీద పడకుండ చేశావ్' అనుకొంటూ అక్కడ చుట్టూ— సిగరెట్టు పొగ ఢీ కొట్టుకొంటుంటే కొంత ముందుకెళ్లి 'బాబూ కొద్దిగా సర్దుకొండి. నేనూ కూర్చొంటాను' అన్నాడు ధర్మారావు, ఆ జంట తెలుగువాళ్లని కనిపెట్టేందుకు యిట్టే పట్టలేదాయనకు.

'అదంతా స్థలం కదటండీ' మొదట కోపంతో విసుక్కొన్నారు పెళ్లయిన కొత్త జంట.

'ఎంపుర్ కోసం బాబూ అడుగుతోంది. చెప్పమ్మా కూతురా అల్లుడికి' ప్రబతిమాలాడు. బంధుత్వం కలుపుకొన్నాడు.

'పావం! ముసలాడండీ' ప్రక్కకు జరిగింది కూతురన్నందుకు బిస్సైపోతూ, ఆమె జాలి' హృదయంతో. విసుక్కొంటూ జరిగాడు అల్లుడు.

ధర్మారావుని ఎవరైనా ముసలాడంటే ఒప్పుకోడు. అయితే పరిస్థితులనుబట్టి ఆ సమయంలో ఒప్పుకోవల్సివచ్చింది.

దర్జాగా యాభైయ్యైదునుంచి ఇరవైయ్యైదుకు తగ్గి హిందీ హీరో ఫోజులో కూర్చొని గళ్లచొక్కావాణ్ని ఒక్కసారి చూశాడు. గళ్లచొక్కావాడు ఎందుకో నవ్వుతున్నాడట్లా మరోసారి గుడ్లురిమి చూడ్డంతో 'ఛీ...పోరా దొంగవెధవా! ఎందుకలా చూచి భయపెడతావ్' అనుకొని క్రింద కూర్చొనివున్న ముసలాడి పైకి దృష్టి మళ్లించాడు.

ముసలాడు ప్రక్కనే ఒకతను చదువుతున్న విజయచిత్ర అప్పువిరాది జ్యోతిషిత్ర

హరిరామ్









# కలిసి పయనించటం లాభదాయకం!




మీరు ఒక గుంపుగా ప్రయాణం చేస్తే ఎయిర్-ఇండియా వారి ఎఫినిటీ గ్రూప్ స్కీము క్రింద తక్కువ, చాలా తక్కువ ఛార్జీలు చెల్లించవలసి ఉండును.

**ఎటువంటి గుంపులు ఇందుకు అర్హులు ?**

**మీ గుంపులో కనీసం 15 మంది సభ్యులైనా ఉండాలి. వీరంతా కనీసం 6 మాసాల పాటైనా ఒకే స్కూలు/కాలేజి, ఇన్‌స్టిట్యూట్, ఫర్మ్, క్లబ్, సొసైటీ, కార్పొరేషన్, అసోసియేషన్ లేక సమాఖ్యకు చెందినవారై ఉండాలి.**

**ఎటువంటి ప్రయోజనానికి ?**

ఒక కాన్ఫరెన్స్ లేక కన్వెన్షన్‌కు హాజరవ్వటానికి గాని లేక కులాసా కోసం గాని మీరు ప్రయాణం చెయ్యదలచినట్లైతే మీకా తగ్గింపు సదుపాయం లభించగలదు. ఎయిర్—ఇండియా మీ గుంపులో భాగముగా మీ భార్య/భర్త మరియు పిల్లలను కూడా చేర్చటానికి అంగీకరించగలదు. నిజంగా మీరు ఎంతో డబ్బు—కొన్ని సెక్టర్లలో ఒక్కొక్క ఛార్జీ మీద రు 2,000 లకు పైగా—ఆదా చేసుకోగలుగుతారు.

మీ స్థానిక ఎయిర్-ఇండియా ఆఫీసు లేక మీ ట్రావెల్ ఏజెంటును పూర్తి వివరాలకై సంప్రదించండి. కలిసి ప్రయాణం చేయటం ఎంతో లాభదాయకమని మీరు తెలుసుకోగలుగుతారు.

**ఎయిర్-ఇండియా**

మిమ్మల్ని ప్రేమించే ఎయిర్‌లైన్

# తిరుపతి ప్రయాణం

బొమ్మను చూచి చిరిగివున్న తన చొక్కాను సర్దుకొని సగం విరిగిన దువ్వెన ముక్కను జేబులోంచి తీసి తల దువ్వుకొన్నాడు. మరలా ఆ బొమ్మనే చూస్తూ వుండి పోయాడు.

అదంతా తదేకంగా చూచి మనసులోనే నవ్వుకొన్నాడు ధర్మారావు. తనూ ఒక్కసారి తలను ఎడమచేత్తో తగిలీ తగలనట్లు సర్దుకొని కోటుజేబులో వున్న ఇండియన్ ఎక్స్‌ప్రెస్ బయటికితీసి దాన్ని చదవడంలో నిమగ్నుడయ్యాడు.

ధర్మారావు పేరుకే ధర్మారావు. ధర్మమంటే అర్థం తెలీదు. పైసా దొరికితే వది ముళ్ళు వేస్తాడు. ఒకర్నిగూర్చి బాధపడ్డు. తను బాగా బతికితే చాలు.

కొడుక్కి డిగ్రీ పూర్తి అవుతూనే పైసా లంచంలేకుండ ప్రభుత్వోద్యోగం దొరికి పదివేల రూపాయల కట్నంతో వధువు ఇంటికొస్తే శ్రీ వెంకటేశ్వరస్వామివారికి తిరుమలకొచ్చి కానుగ్గా (ఆయన దృష్టిలో లంచం) ఇరవయ్యో, ముప్పయ్యో ముడుపుజెప్పి తలవెంట్రుకలిస్తానని ఎప్పుడో ఒప్పుకొన్నాడు.

ఆ వెంకటేశ్వరస్వామి దయవల్లో కొడుకు డిగ్రీ పుచ్చుకొన్నాడు. మూన్నెల్లు తిరక్కముందే పైసా లంచం లేకుండా ఓన్‌లీ రెకమండేషన్‌తో ప్రభుత్వోద్యోగంలో చేరాడు.

పదివేలరూపాయల కట్నంకోసం కొడుక్కి పెళ్ళిచేయదలచుకొన్న ధర్మారావు బీరకాయ పీచులా అల్లుకపోయిన బంధుత్వంలో బోలెడమ్మాయిలున్నా బయటి అమ్మాయిని వెతకాల్సి వచ్చింది. వెతికాడు.

ఆఖరికి మ్యాట్రిక్ ఫైనల్ పూర్తి చేసిన భీమశంకరంగారి ఏకైక పుత్రికను తనింటి కోడలుగా చేసుకోదలచుకొని అనుకొన్న పదివేలరూపాయల కట్నంలోంచి అయిదువేలు అడ్వాన్సుగా తీసుకొన్నాడు.

అయితే కూతురు పార్వతికిమాత్రం కట్నమంటే పడని కరణం కోదండ రామయ్యగారితో విద్యనందిచ మాస్టారు డిగ్రీ ప్యాసైన ఆయన కొడుక్కి కట్టబెట్టి చేతులు కడుక్కొన్నారు నిశ్చింతగా.

మాటవరుసకు యెవరైనా 'ధర్మారావుగారూ! మీ పార్వతికి యెంతకట్నమిచ్చి పెళ్ళి జరిపించార' నడిగితే 'కరణం కోదండ రామయ్యగారికి కట్నమంటే గిట్టదయ్యా! నా తృప్తికోసం ఓ అయిదువేలు యివ్వబోతే వద్దన్నారు' అని చెప్పి దానివెంటనే 'ఇదిగో చూడండి! నా కొడుక్కికూడా నేను కట్నమడుగ దలచుకోలేదు. అయితే వాన్ని అద్దం రూపాయలే పోసి డిగ్రీ పూర్తి చేయించినందుగ్గాను ఏదో కొద్దిగా పదివేల రూపాయలు కట్నం డిమాండ్ చేస్తున్నాను' అని చెప్పుకొని నవ్వేవాడు.

అనుకొన్న ఆ రెండు జయప్రదంగా జరుగుతున్నాయ్. కనుక ముహూర్తం పెట్టుకోకముందే తన మొక్కుబడి ప్రకారం తప్పక తిరుపతికి ప్రయాణం కావల్సి వచ్చింది ధర్మారావు.

ఇంటివద్ద బయలుదేరేప్పుడు కొడుకు తన పేర వందరూపాయలు హుండీలో వేయమని చేతికిచ్చాడు. ఆ డబ్బు వలాగే ఎయిర్ బాగ్‌లో వుంచేసుకొని 'మొత్తానికి వెంట్రుక లొప్పుకొన్నారేరా'ని చెప్పి నవ్వేశాడు. పుత్రరత్నం అలాగే చూచి వూరుకొన్నాడు.

'ఏమండీ! మన పార్వతికి మగపిల్లాడయితే అర్థనూటపదహార్లు హుండీలో వేస్తానని శ్రీ తిరుమలస్వామికి ఒప్పుకొన్నాను. వీటిని కూడా తీసుకోండ'ని చేతికిచ్చిన అర్థనూటపదహార్లనూ ఎయిర్‌బాగ్‌లో వుంచేసుకొంటూ 'ఏమేవ్! వాళ్ళకు కొడుకు పుడితే మనకేం యిక్కడ జరిగిపోదులే. ఆ మొక్కుబడేదో అల్లుడికి జాబు వ్రాసి తెప్పించుకొని ఆ తిరుమలస్వామికి చెల్లించుకో' అని చెప్పి చక్కా బయలుదేరాడు 'ఈ డబ్బు మొత్తానికో రేగడూడను కొనుక్కోవచ్చులే' అనుకొంటూ. సతీమణి ముఖం తెల్లబోయింది.

అదంతా ఒక్కసారి తలచుకొని మెల్లగా నవ్వుకొన్నాడు. అప్పటికే పదిసార్లు ఎయిర్ బాగ్ తెరచి డబ్బుని చూసుకొన్న ధర్మారావు పదకొండోసారి కూడా చూసుకొన్నాడు. అదంతా గళ్ళచొక్కావాడు గమనిస్తూనే వున్నాడు.

రైలాగింది—

'ఇదే స్టేషనండీ' అడిగాడు గళ్ళచొక్కావాడు అల్లాన్నే.

—'అరక్కోణం' అన్నాయత్నంగా జవా

ఇచ్చాడు అల్లుడికన్నా ముందు ధర్మారావు.

'నిన్నా అడిగింది' అన్నట్టు వురిమి చూశాడు గళ్ళచొక్కావాడు.

'క్షమించు బాబూ! చెప్పింది నాదే తప్పు' అన్నట్టు భయపడి తల త్రిప్పుకొని, 'ఏమిటి వేధన ప్రతి విషయానికిలా భగ్గున మండిపోతాడు' మనసులోనే గొణుక్కొన్నాడు ధర్మారావు.

గళ్ళచొక్కావాడు దిగి కాఫీకార్ వద్ద కెళ్ళి నిలబడ్డాడు. అంతకుముందే ముసలాడు బండి దిగి వెళ్ళిపోయాడు.

'ఇక్కడెంతసేపాగుతుందండీ బండి?' అల్లుడి ప్రశ్న.

'పావుగంటాగుతుంది. ఇప్పటికే ఒకటింబావుగంట లేటుల్లాడు. కనీసం ఇక్కణ్ణుంచి ఎనిమిదింముప్పావుకైనా బయలుదేరికావాలి. ఆఁ...ఎటూ నేను తిరుపతికి చేరేసరకు ఖచ్చితంగా మధ్యాహ్నమయ్యేలా వుంది' వాచీ చూచి చెప్పాడు ధర్మారావు.

'పారూ! ఏదీ అమ్మ టిఫినిలో పూరీ లుంచిందన్నావే' భార్యతో అన్నాడు అల్లుడు.

'అవునండి' కూతురు టిఫిన్ని బయటికి తీసింది. అరిటాకులో రెండుంచి భర్తకిచ్చింది. తనూ రెండు తీసుకొంది. తింటున్నారు—

ధర్మారావుదగ్గర డబ్బుంది. బయటికెళ్ళి యేమైనా కొని తినాలనుకొన్నాడు. మనసు రాలేదు. డబ్బు పోతుందనే చింత. కూతురెలాగైనా రెండు పూరీలు యిస్తుందనుకొన్నాడు. వాళ్ళిద్దరూ తింటుంటే చూస్తూ ఒక్కసారి గుటక మింగాడు అది గమనించింది కూతురు.

'క్షమించండి బాబాయ్! మీ సంగతే మరచిపోయాం. ఇదిగో ఈ రెండు పూరీలు తీసుకోండి' ఇవ్వబోయింది.

'వద్దమ్మా. వద్దు' మనసులో తీసుకోవాలనే ఉద్దేశ్యమే. అయితే డిగ్నిటీ ఒకటి అడ్డువడింది.

'ఫర్వాలేదు తీసుకోండి' అల్లుడు తీసి చేతికిచ్చాడు.

ధర్మారావు వచ్చి ఎడమచేతిలో వుంచుకొని కుడిచేత్తో పూరీ ఓ ప్రక్క విరిచి నోటిలో వేసుకున్నాడు.

'పారూ! ఆ మరచెంబిలా యివ్వు. నీళ్ళు తెస్తాను.'

అల్లుడు చెంబు తీసుకొని కొళాయివద్ద కెళ్ళాడు. కాఫీకార్‌వద్ద గళ్ళచొక్కావాడు కాఫీతాగడులా వుంది. యిప్పుడు సిగరెట్టు పీల్చేస్తున్నాడు.

'అమ్మా! నీపేరు పార్వతా' అప్యాయంగా అడిగాడు అప్పుడే రెండు పూరీలు తిని అరిటాకుతో చేతిని తుడుచుకొంటూ ధర్మారావు.

'అవును బాబాయ్! నా పేరు పార్వతి. మావారు 'పారూ' అంటారు.' ఖాళీటిఫిన్ని ప్రక్కనుంచింది.

'నా కూతురిపేరు కూడా పార్వతే నమ్మా. పోలికలు వేరైనా అచ్చం నా కూతురి గుణగణాలే నీలో అతికాయంటే నమ్ము.'

కూతురు నవ్వుకొంది. మరచెంబుతో నీళ్ళు తీసుకొని లోపలికొచ్చాడల్లుడు. నీళ్ళు తాగారు ముగ్గురూ.

'పార్వతమ్మా! ఈ కాఫీ తీసుకో' ఫ్లాస్కులోంచి ప్లాస్టిక్ గ్లాసులో పోసి చేతికివ్వబోయాడు ధర్మారావు.

'ఏమిటి బాబాయ్ మీరు' కూతురి పెదాల మీద నవ్వు తొంగి చూసింది.

'ఫర్వాలేదు తీసుకో. పెద్దవారు ఇచ్చేప్పుడు వద్దనకు' అల్లుడన్నాడు గ్లాసు తీసుకొంటూ.

గట్టిగా వద్దంటే సరిపెట్టుకోవాలనుకొన్నాడు ధర్మారావు. వీలుపడలేదు. గ్లాసు మూడుసార్లు కాఫీతో నిండింది. మొదటో ఫ్లాస్కు ఖాళీ అయింది.

గార్డు విజిల్ యిచ్చాడు. రైలు కూతేసింది. పట్టాలమీదున్న చక్రాల బ్రేకులు సళ్ళు వదిలాయి. గళ్ళచొక్కావాడు యెక్కి కూర్చొన్నాడు.

రైలు వేగం పుంజుకొంది. స్టేషన్లు వెనక్కెళ్ళిపోతున్నాయ్.

'అల్లుడా! ఏమిటి బండిలో లైట్లు సరిగా వెలగడం లేదు.' కళ్ళు మూసుకుపోతున్నాయ్ ధర్మారావుకి.

'అవునండి. డైనామో వీక్ అయి వుంటుంది' పైకొక్కసారి చూచి సర్దుకొని కూర్చొన్నాడు అల్లుడు ఆవులిస్తూ. కూతురెప్పుడో నిద్రపోయింది.

'జాగ్రత్త బాబూ! ఆదమరచి నిద్రపోకండి. మీకు బెడ్డింగు, సూట్‌కేసు వగైరాలు చాలా వున్నాయ్. నాకేం భయం లేదనుకో! అయినా నా దగ్గర ఈ ఒక్క ఎయిర్ బాగ్, ఫ్లాస్కు తప్ప ఏముందిలే!' ఎయిర్ బాగ్‌ని ఒక్కసారి చూసుకొని



గళ్ళచొక్కావాణ్ణి చూశాడు— గళ్ళచొక్క వాడు నిద్రపోతున్నట్లా వుంది కళ్ళు మూసుకొని వున్నాడు—ధర్మారావూ కళ్ళు మూసుకొన్నాడు.

రైలాగింది—

అందరూ దిగి వెళ్ళిపోతున్నారు. ఎవరో తట్టి లేపినట్లు దిగ్గున లేచి కళ్ళు నులుపు కొన్నాడు ధర్మారావు.

'పార్వతమ్మా' చూశాడు. ఎవరూ లేరు తను తప్ప.

'ఇదే వూరు' కిటికీలోంచి బయటికి చూశాడు. అది తిరుపతిలా వుంది ప్లాట్ ఫారం మీదున్నవారు తొంబది శాతం గుండ్లు చేయించుకొనున్నారు. కొందరు నిద్రపోతున్నారు. కొందరు కూర్చొని కునికి పాట్లు పడుతూన్నారు. ఏదో బండికోసం నిరీక్షిస్తున్నారు మరి కొందరని వాళ్ళ చూపులు తెలుపుతున్నాయ్ ధర్మారావుకి. తిరిగి ప్రక్కకు చూశాడు. గుండె ఝల్లు

## తిరుపతి ప్రయాణం

మంది. మెడతో ప్లాస్క్ ఒక్కసారి అటూ—ఇటూ ఆడింది. క్రింద చూశాడు. ఎయిర్ బాగ్ టేప్ తెగి ముందు పడుంది. తెరచి చూశాడు. అందులో ఓ కాగితం మడతపెట్టుంది. గుండాగినంత పనైంది ధర్మారావుకి. కాగితాన్ని విప్పి చూశాడు. మడతలో పది రూపాయల నోటు ఒక టుంది. గుండె వేగంగా కొట్టుకొంది—

ధర్మారావుగార్కి!

క్షమించండి. పదిసార్లుకుపైగా ఎయిర్ బాగ్‌ని చూచుకొని తోటి ప్రయాణీకులకు జాగ్రత్తలు చెప్పినప్పుడే ఈ ఎయిర్ బాగ్‌లో ఖచ్చితంగా డబ్బుంటుందని గుర్తించాను. మనతో ప్రయాణంచేసిన ఆ జంట తిరుపతికి ముందు స్టేషన్లోనే దిగి వెళ్ళి పోతూ చెప్పి వెళ్ళాలని కాబోలు మిమ్మల్ని తట్టి లేపారు. మీరు గాఢనిద్రలో వుండ డంతో లేవలేకపోయారు. వాళ్ళు వెళ్ళి పోయారు.

ధర్మారావుగారూ! ఈ సమయం చూచు కొని మీ దగ్గర ఈ డబ్బు దొంగిలించి నందుకు...కాదు ... తీసుకొన్నందుకు నన్ను క్షమించండి. నేనూ శ్రీ వేంకటేశ్వర స్వాములవారికి మూటపదహార్లు మొక్కుబడి ఒప్పుకొన్నాను. కాని ఆ రోజు కలసిరానం దుకు దుఃఖించి చివరికి కేవలం ఆ వేంక టేశ్వరస్వామి దర్శన నిమిత్తమే తిరుపతికి బయలుదేరాను. అయితే నా అదృష్టం పండడంతో మీ దురదృష్టవశాత్తు మీ ద్వారా నా కొరత తీరింది. మీరు తీర్చి నందుకు సంతోషిస్తున్నాను. ఇదిగో... ఈ మడిచి వుంచిన జాబులోని పది రూపాయలు మీ తిరుగు ప్రయాణానికి.

ధర్మారావుగారూ! నేను తిరుమలస్వామికి మొక్కుబడి వున్నాను. మీరూ ఆ స్వాముల వారికే మొక్కుబడి వున్నారు. అంచ కని మనిద్దరిలో ఎవరు మొక్కుబడి చెల్లించినా అది శ్రీనివాసుడికే చెల్లుతుంది. మరేమను కోకండి. వీలైతే ఈ డబ్బు యింకో సంవ త్సరానికైనా మీ అడ్రసుకు మనియార్డరు చేస్తాను. నా అడ్రసు కూడా మీ కప్పుడే రాస్తాను. మీ అడ్రసు నాకెలా తెలిసిం దంటూరా... ఇదిగో...మీ ఎయిర్ బాగ్ మీదే వుందిగా! నన్ను మరోసారి క్షమించండి.

సెలవు,

ఇట్లు,

శ్రీ తిరుమలస్వామి భక్తుడు.

జాబంతా చదువుకొన్నాడు. తనొకటి తలిస్తే దైవమొకటి తలచిందనుకొన్నాడు. 'వెంగడాడను కొనవలసిన డబ్బు గళ్ళచొక్కా వాడు...' మనసులోనే గొణుక్కున్నాడు. దుఃఖంతో విస్తుపోతూ తిరుగు టిక్కెట్టు కొనుక్కొని రైలెక్కి కూర్చొన్నాడు ధర్మా రావు. ●

అంకితం : నన్నో ఓ రచయితగా మార్చిన నా మిత్రుడు గుడిమెట్ల చెన్నయ్యకు. —రచయిత

## సినిమా

### నాగభూషణం స్త్రీ వేషం!

ప్రసిద్ధ నటుడు నాగభూషణం వెయ్యని వేషంలేదు వేసిన ప్రతి వేషంలో తన ప్రత్యేకతను చూపించారు అందుకే ప్రజల అభిమాన నటులయ్యారు ఇటీవల విడుదలయిన 'కోడలుపిల్ల' కూడా నాగభూషణం వల్లె విజయవంతమైంది

రవి ఆర్ట్స్ పేరిట నాగభూషణం సమర్పిస్తున్న 'ప్రజానాయకుడు' చిత్రంలో ఆయన స్త్రీపాత్రను ధరించారు కనిపించేది ఒక్క క్షణమే అయినా, ఆక్షణంలో ప్రేక్షకులను ఆకర్షించే విధంగా నటించారు



'మేనకోడలు' లో జమున

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పీచమణచడానికి విప్లవం లేవదీసిన ఒక వ్యక్తి స్వలాభంకోసం వారికి గులాముగా మారి ప్రజల డబ్బును దోచుకున్న విచిత్ర పరిణామసారమే 'ప్రజానాయకుడు' చిత్రం

'ప్రజానాయకుడు' చిత్రానికి [illegible] ముంత మాటలను, వి ఎస్ ఆర్ స్వామి ఛాయను, మహదేవన్ సంగీతాన్ని సత్యం కూర్పును నిర్వహించారు ప్రధాన పాత్రలను జగ్గయ్య, జానకి, రాజబాబు, రమాప్రభ, పెరుమాళ్ళు, చంద్రమోహన్, జయ పోషించారు

పై చిత్రంలో కృష్ణకు కార్మిక నాయకుడి పాత్ర లభించింది పాత్ర చాలా చిన్నది కాని నటన మెచ్చదగినదిగా వుంది

ఈ చిత్రం ఆగస్టు 4న నవయుగ ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో విడుదలవుతుంది,

### రికార్డ్ బ్రేక్!

ఉష శ్రీవారి 'మానవుడు — దానవుడు' వసూళ్లను చూస్తే, యిదివరకటి సంపూర్ణ తెలుగు చిత్రాల వసూళ్లను అధిగమించేటట్టు కనిపిస్తూంది రెండు వారాలకి 11 లక్షలు కలెక్టు చేసింది ఈ చిత్రానికి సరయిన పోటీ చిత్రం యిప్పటివరకు రాలేదు ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడుతున్న చిత్రాలన్నింటికన్నా, దీనికే ఎక్కువ జనం వస్తున్నారు

శోభన్‌బాబు తెరపై జగన్ పాత్రలో కనిపించినప్పుడల్లా, ప్రేక్షకులు కరతాళధ్వనులు చేసి శభాష్ [illegible] అంటున్నారు

నేను విడుదలకు ముందు [illegible] విచారించినప్పుడే యీ చిత్రం [illegible] రెండు వారాల్లో శత దినోత్సవం చేసుకోవడం తథ్యం అని [illegible] — శోభన్ — శారదల జంటను విజయవంతమైన జంటగా పేర్కొన్నాను

ఉత్సాహ భావాలున్న యువ నిర్మాత చిన్నపరెడ్డికి యీ చిత్రం ఎన్నో లాభాల [illegible] కలిగిస్తుంది యువతరంలో తనకొక ప్రత్యేకత వుందని దర్శకుడు చంద్రశేఖరరెడ్డి మరొకసారి నిరూపించారు

మూడు తరహాల మహిళలు!
మూడు తరహాల జీవితాలు!

నిత్యం కనిపించే వ్యక్తులు!
మీతో మెలిగే మనుషులు!



విలాసాలకు, ఆకర్షణలకు
లొంగిపోయేలా చేసి
మోసగించి బ్లాక్ మెయిల్
చేసే వారిని యువతీయువకులు
ఎలా ఎదుర్కోవాలి?

నమ్మించి మోసగించే
వంచకుల బెదిరింపులతో
బ్రతుకు నరకం కాకుండా
వుండాలంటే ఏం చెయ్యాలి?

జీవితాన్ని విలాసాలతో
గడిపితే లభించే ఆనందం-
జీవితాన్ని అర్థం చేసుకొని
ఆలోచనలతో
ముందుకు సాగితే లభించే
సంతృప్తి-
ఈ రెండింటిలో
ఏది ముఖ్యం?!

రవిశంకర్ పిక్చర్స్ వారి

# మేనకోడలు




నిర్మాత:
**వై. సునీల్ చౌదరి**

దర్శకత్వం:
**బి.యస్. నారాయణ**

కథ: మాదిరెడ్డి సులోచన   మాటలు: దాసరి నారాయణరావు
సంగీతం: ఘంటసాల   కెమెరా: వి. వి. ఆర్. చౌదరి

VEEKAY   సోల్ డిస్ట్రిబ్యూటర్స్: అనిల్ ప్రభాస్ ఎంటర్ప్రైసెస్. నవయుగ

యుండడం వాళ్ళ అలవాట్లూ అలాంటి వ ప్రేమలో పడితే...?

ఆ అమ్మాయికూడా అంతే. రామాయణ, భారతాలు పారాయణం చేసిందేగానీ, పాపం నాలుగు ఇంగ్లీషు ముక్కలయినా నేర్చుకోలేదు. పెద్దలంటే గౌరవం, పాపంపట్ల భయం ఆమెకి. అలాంటి అమ్మాయి ప్రేమ పురాణం సాగిస్తే...? ఈ వింత పాత్రలను పోషిస్తున్నవారు ఎవరో తెలుసా? 'మానవుడు—దానవుడు' నాయకీనాయకులే. ఇంతకీ చిత్రం పేరు ఏమిటో తెలుసా? మమతా ప్రొడక్షన్స్‌వారి 'కాలం మారింది' పత్రికా రచయిత వాశిరాజు ప్రకాశం



'వింత దంపతులు'లో జమున

నిర్మించే ఈ చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకుడు.

పూజ్య బాపూజీకి అంకితం చెయ్యబడే ఈ చిత్రానికి బొల్లిముంత మాటలను, రాజేశ్వరరావు సంగీతాన్ని, కళాధర్ కళను. అశోక్‌కుమార్ ఛాయను, సత్యం కూర్పును నిర్వహిస్తున్నారు.

బొమ్మశెట్టి హనుమంతరావు సమర్పించే ఈ చిత్రంలో గుమ్మడి, అంజలీదేవి, చంద్రమోహన్, గీతాంజలి, సూర్యకాంతం, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు ముఖ్యపాత్రధారులు. [illegible] విడుదల

# సినిమా

## ఇల్లు—ఇల్లాలు

నందినీ ఫిలింస్‌వారి 'ఇల్లు—ఇల్లాలు' చిత్రం 12 రీళ్లు పూర్తయింది. ఇప్పటి వరకు నాలుగు పాటలు చిత్రీకరించబడ్డాయి. కె. సుబ్బిరెడ్డి సమర్పించే యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

పై చిత్రానికి ఆరుద్ర, అప్పలాచార్య పాటలను వ్రాశారు. ముఖ్యపాత్రలను వాణిశ్రీ, కృష్ణ, గుమ్మడి, సూర్యకాంతం, రాజబాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య, కృష్ణంరాజా, లీలారాణి, ప్రభాకరరెడ్డి పోషిస్తున్నారు. తల్లీ—కూతురుగా వాణిశ్రీ ద్విపాత్రాభినయం యీ చిత్రంలోని ప్రత్యేకత. నాగభూషణం, కాంతారావు గెస్టు పాత్రలను ధరించారు.

జూలై 18 నుండి 23 వరకు జరిగే షెడ్యూలుతో షూటింగు దాదాపు పూర్తి అయినట్టే. ఈ చిత్రానికి కె. వి. మహదేవన్ సంగీతాన్ని, సుకదేవ్ ఛాయను నిర్వహిస్తున్నారు. నిర్మాతలు: ఎన్. సుబ్బారాయుడు, జె. వి. రామసుబ్బయ్య. నిర్వాహణ పి. వి. రమణయ్య

'ఇంటికి దీపం ఇల్లాలు. ఇల్లాలు లేని యిల్లు శ్మశానంతో సమానం గృహమేకదా స్వర్గసీమ అన్నారు పెద్దలు. ఒకయింటి యొక్క గౌరవ, మర్యాదలను కాపాడేశక్తి ఇల్లాలికేవుంది. చెడిపోయే భర్తను బాగు చేసే శక్తికూడా ఆమెకేవుంది' ఇదీ 'ఇల్లు—ఇల్లాలు' చిత్రకథ.

## లారీ డ్రయివర్‌గా శోభన్

శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ ఎంటర్ ప్రైసెస్ నిర్మించే చిత్రంలో శోభన్‌బాబు లారీ డ్రయివర్‌గా నటిస్తున్నారు. బతాసీలు అమ్మే వనితగా కాంచన నటిస్తుంది. ఒక ముఖ్యభూమికను నాగభూషణం ధరిస్తున్నారు. ఈ చిత్రానికి కె. ఎస్. ప్రకాశరావు దర్శకుడు.

## ఇన్‌స్పెక్టర్‌గా కృష్ణ

శక్తిమూవీస్‌వారి 'ఇన్‌స్పెక్టర్ భార్య' చిత్రంలో కృష్ణ పోలీస్ యిన్‌స్పెక్టర్‌గా నటిస్తున్నారు. అతగాడి ధర్మపత్నిగా చంద్రకళ నటిస్తుంది. ఒక ముఖ్యపాత్రను కృష్ణంరాజు పోషిస్తున్నాడు. ఈ చిత్రానికి సత్యనారాయణమూర్తి దర్శకుడు.

## నర్సుగా లక్ష్మి

పద్మశ్రీ పిక్చర్స్‌వారి 'ప్రేమకోసం' రంగుల చిత్రంలో లక్ష్మి నర్సుగా నటిస్తూంది. అక్కినేని — వాణిశ్రీ ముఖ్యపాత్రలను పోషిస్తున్న ఈ చిత్రానికి పి. పుల్లయ్య దర్శకుడు.

## మీకు తెలుసా

హిందీనటి ముంతాజ్ బాగా పాడగలదట.

కిశోర్‌కుమార్ కుమారుడు తండ్రినిమించిన గాయకుడు అయ్యేట్టు వున్నాడట.

మున్ముందు రాజేష్‌ఖన్నాతో, ఎక్కువగా మున్మున్ ఛటర్జీ నటిస్తుందట.

షర్మిలా యికపై అమితాబ్‌తో ఎక్కువగా నటిస్తుందట.

తెలుగునటి శారద పాత్రలు నచ్చక, అయిదారు హిందీ చిత్రాలను వదిలివేసిందట.

నటి లక్ష్మికి నెలకు రు. 600లు అభిమానులకు ఉత్తరాలు వ్రాయడానికి ఖర్చవుతుందట.

## జితేంద్ర—ముంతాజ్ వివాహం?

హిందీనటి ముంతాజ్, హిందీనటుడు జితేంద్ర త్వరలోనే దంపతులు కాబోతున్నారు. త్వరలోనే అంటే మూడు సంవత్సరాల తర్వాత అన్నమాట. 1975 వరకు తను పెండ్లి చేసుకోబోనని ముంతాజ్ చెప్పింది. ఆ తర్వాత రిటైర్ అవుతుందేమో !

## లక్షరూపాయల విమానం

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్‌వారు 'పాపం పసివాడు' వర్ణ చిత్రానికిగాను లక్ష రూపాయల్లో ఒక విమానాన్ని కొన్నారు. సన్నివేశం కోసం. ఆ విమానం కూలి, కాలిపోయింది. సహజత్వం కోసం ఇలా చెయ్యాల్సి వచ్చింది అన్నారు, ఏ. పూర్ణచంద్రరావు. ఈ చిత్రం తెలుగులో సరికొత్త ప్రయోగం. ఈ చిత్రానికి వి. రామ

(64వ పేజీ చూడండి)



'పండంటి కాపురం'లో దేవిక, విజయనిర్మల, ప్రభాకరరెడ్డి.

# టెన్నిస్‌లో "ధనధన" గొడవలు డబ్బుకు తలొంచే ఆటగాళ్లు

## భారీ విల్సన్ * * * * * * * * * * * * * * * * * * *

వింబుల్డన్ ఆటల బహుమతుల డబ్బు ఘూమ్మని క్రితం లక్షల పవున్లకు ఎదుక్కుంటూ పోవచ్చని, 1972 వ సంవత్సరపు యీ ఆటల సమయం దగ్గర పడుతున్న కొద్దీ వృత్తి రీత్యా యీ ఆట ఆడేవారు, తమ ఆటను రాబడితో ఎలా కొలుచు కుంటున్నారో కళ్ళకు కట్టినట్టు కనిపిస్తోందని ఫోరమ్ వరల్డ్ ఫీచర్స్ విలేఖరి భారీ విల్సన్ అభిప్రాయపడ్డారు.

* * *

గత సంవత్సరాలలో వృత్తి రీత్యా యీ ఆట ఆడేవారు, వారిని ఆడుకోడమే వృత్తిగానూ, వ్యాపారంగానూ పెట్టుకున్న సంస్థలు వారూ తమ కదలిక లను చాలా జాగ్రత్తగా చూసుకున్నారు. తద్వారా రాబడులు పెరిగాయి. అంతేగాక, యీ ఆటల విన్యాసాల్లో వారు యిదివరకెవ్వరూ పొందని అధికారాన్ని ధారపోస్తున్న సంపాదించుకున్నారు. కానీ మరినాడు తమ స్థానాన్ని కేవలం డబ్బు కోసం వదులుకుంటున్నారు.

బహిరంగ టెన్నిస్ పుట్టుకలకు కొన్నాళ్ళ క్రితం యీ టెన్నిస్ ఆటను కేవలం వృత్తిగా పెట్టుకున్న వారు హాయిగా డబ్బు చేసుకున్నారనే, మాట గిట్టని వాళ్ళనే మాటగానూ, పుక్కిటి పురాణంగానూ వుండేది. 1950 వ సంవత్సరం చివర్నుంచి 1960 వ సంవత్సరం ఆరంభం— లేక మధ్యవరకూ ఏ సంవత్సరంలోనైనా సరే మహా అయితే ఒకరిద్దరాటగాళ్ళు బాగా డబ్బు చేసుకుంటే చేసుకునుండొచ్చు.

జాక్ క్రోమర్ అనే ఆయన ప్రసిద్ధి చెందిన వో ఆమెచ్యూర్ ఆటగాడిని తెచ్చి, నిత్య యవ్వను డైన పాంకో గొంజలేస్‌కు ఎదురుగా వృద్ధరాడ ఆటలో సిలా మూలం లేకుండా నిలబెట్టిన రోజులవి: చినవాళ్ళు పెద్దలు బాగానే సొగు చేసు కున్నారు గానీ, ఇది మూడునాలుగాటల వరకొచ్చే సరికి బ్రహ్మప్రళయంగా మారింది.

వింబుల్డన్ ఆటనే జీవనోపాధిగా పెట్టుకున్న వారికీ, ఆ ఆటను కేవలం ఆట కోసమే ఆడేవారికీ, ఆ ఆట ఆడుదామనే వుత్సాహంతో రంగంలో దిగేవారికీ— వీరందరికీ వింబుల్డన్ సమాన అవకాశాలిస్తున్నట్టు బ్రిటిష్ లాన్ టెన్నిస్ ఎసోసియేషను చేసిన అద్వితీయ ప్రకటన ధర్మమా అని మునుపెన్నడూ కనీవినీ ఎరుగని విధంగా 1968లో యీ ఆటల్లోకి డబ్బు ప్రవాహంగా కొట్టుకు వచ్చింది. అసలు, మిగతా ప్రపంచమంతా యిదే నోము పట్టింది.

కానీ, గత కొన్నిసంవత్సరాల ఫలితాలను బట్టి చూస్తే యీ నిర్ణయం మధ్య వేళాకోళంలా కనిపిస్తుంది. 1968 లో బ్రిటిష్ లాన్ టెన్నిస్ ఎసోసియేషను తానన్నమాట మీద నిలబడిందని ఒప్పుకు తీరాల్సిందే కానీ, బాగా ఆడే ఆటగాళ్ళతోనూ, వృత్తి రీత్యా ఆడే ఆటగాళ్ళతోనూ, నేర్చుకుంటూనే ఆడే ఆటగాళ్ళతోనూ చూపరులకు విసుగెత్తింది.

ప్రపంచ టెన్నిస్ ఆటలలో ఒక్క వింబుల్డన్ మాత్రమే వృత్తి ఆటగాళ్ళు లేకుండా నెగ్గుకు వచ్చింది.

ఇహ రెండేళ్ళ క్రితం విషయం ఆలోచిస్తే టెక్సాస్ కోటీశ్వరుడు లేమర్ హాంట్ వల్లని రెక్కల క్రింద వృత్తి ఆటగాళ్ళు తమ భుజబలాలను పెంచుకున్నారు. ప్రపంచంలోని టెన్నిస్ ఆమెచ్యూర్ సంస్థలతో వారు తమ లేట్లని యిదేప్పుగా పెంచుకుంటూ పోయారు. వీరితో యీ ఆటలో చాలా పెద్దవారు. ప్రపంచంలో కల్లా గొప్ప టెన్నిస్ ఆటగాళ్ళలో కనీసం 32 మందైనా లేమర్ హాంట్ గ్రూపులో వున్నారు గేటు వసూళ్ళు బాగుండాలంటే ఎంత పెద్ద సంస్థయినా సరే, వీరి కూడా పడాల్సిందే! కనుక వాళ్ళు లేమర్ హాంటును గానీ, ఆయన పరివారాన్ని, గానీ చిన్నచూపు చూడలేరు.

ఎటొచ్చీ వింబుల్డన్‌కు యీ గొడవేంలేదు. గత సంవత్సరం యిది ప్రొఫెషనల్స్‌కు ఆహో అని స్వాగతమేమీ పలుకలేదు. 1971 వింబుల్డన్ మెన్స్ సింగిల్స్‌లో ప్రపంచ ఛాంపియన్‌షిప్ టెన్నిస్ గ్రూపులో వో మూడు గ్రూపులు చివ్వరి వినపిటి (ఆటలు) చేశాయి. లేమర్ హాంట్ గ్రూపు వారింకా తమ పట్టు సడలేలోగానే బ్రిటిష్ లాన్ టెన్నిస్ అధికారాలు పుట్టిన వో ప్రకటన చేశాయి.



కేంద్ర విద్యాశాఖ మంత్రి నూరుల్‌హసాన్ వద్ద 'బాయి రతన్‌బాయి రుస్తుమ్‌జీ ఎండ్ సేఠ్ రుస్తుమ్‌జీ భాయా' సువర్ణ పతకం అందుకుంటున్న అమ్మాయి అఖిలభారత 'హయ్యర్ సెకండరీ' పరీక్ష (1971)లో ప్రథమ స్థానం తెచ్చుకుంది. ఈ అమ్మాయి పేరు మీనా. తండ్రిగారి పేరు ఉమామహేశ్వరరావుగారు. ఆయన నాగపూరు సి. పి. హెచ్. ఇంజనీరింగ్ పరిశోధన సంస్థకి ఎసిస్టెంట్ డైరెక్టరుగా ఉంటున్నారు. కుమారి మీనాకి సగటున 83 శాతం మార్కులు వచ్చాయి.

1968 లో లాగానే వారు కాంట్రాక్టు పద్ధతిన ఆటాడే వారిని నిషేధించారు.

దీంతో జనం వెర్రెత్తిపోయారు.

గత సంవత్సరం కన్నా యీఏడు 20 శాతం వింబుల్డన్‌కు అప్పుడే బుక్కింగులు వచ్చేశాయి. ఇహ గత ఏ సంవత్సరానికీ తీసిపోని జనవాహిని యీ ఏడూ వుంటుందనడంలో పిసరంత కూడా అనుమానంలేదు. ఈ సందర్భంలో రాజీలు చాలా ఆలస్యంగా ఆరంభమయ్యాయి. ఇవి 1972 వింబుల్డన్‌కు ఉపయోగం వుంటాయో లేదో తెలీదు. సెయింట్ లూయీస్‌లో యీ ఆటల సమయం

# టెన్నిస్‌లో...

లోనే జరుగబోతున్న వరల్డ్ ఛాంపియన్‌షిప్ ఆటల్లో తన కాంట్రాక్టును వదిలేసుకుంటానని జాన్ న్యూకోమ్బ్ కూడా చెప్పి చూశారు.

## బలవంతమైన సర్పము

న్యూకోమ్బ్, రాడ్ లేవర్, కెన్‌రోజీవాల్ వంటి మహారథులున్నా, ప్రపంచ ఛాంపియన్‌షిప్ టెన్నిస్, గ్రూపు లోగడున్నంత బలంగా యీనాడు లేదు. పేరంతా పోల్గొన్నా, యీ ఏట వింబుల్డన్ మెన్స్ సింగిల్స్‌లో గెలుపు సంపాదిస్తారా అన్నది అనుమానమే! లేవర్, రోజీవాల్, న్యూకోమ్బ్ వంటి వాళ్ళు పెద్దవాళ్ళయి పోతున్నారు. ఇహ యీ గ్రూపులకు చెందనివారు: స్టాన్‌స్మిత్, ఇల్లీనాస్టే, క్లిఫ్‌రిచే, క్లార్క్ గ్రేబ్నర్, జాన్ కోడెస్, టామ్ గోర్మన్, రోజర్ టైలర్, పియరీ బార్తెస్ వంటి వాళ్ళు వున్నారు.

ఏదేళ్ళ క్రితం— బహిరంగ టెన్నిస్ పుట్టుకలకు పూర్వం బాగా ఆట ఆడేవారిలో ఏ యిద్దరు ముగ్గురు సంవత్సరానికో 25 వేల పౌనులు పోమ్ము చేసుకునే వారు. పోయి నేడు లేవర్ సంపాదన 1,20,000 పౌనులు దాటిపోయింది. రోజివాల్ 60 వేల పౌనులు చేరాడు. టామ్ ఓకరు దాదాపు 50 వేల పౌనులు చేరాడు. న్యూకోమ్బ్, అర్థర్ ఆషే చెరో 40 వేల పౌనులకు పైగా గెల్చుకున్నారు. నాస్టేష్, స్మిత్ కూడా అపాటి సంపాదించారు. చాలామంది ఆటగాళ్ళు ఎంత లేదన్నా 25 వేల పౌనులకు పైచిలుకే సంపాదించారు. ప్రస్తుతం టెన్నిస్‌లో బహుమతుల డబ్బు కోసం 1,50,000 పౌనులకు చేరుతుందని చులాగ్గా అంచనాలు వేయచ్చు.

బహిరంగ టెన్నిసు యీ ప్రవాహాని కసలు లాకులు తెరిచింది. భరోసా లిచ్చేవారు లోకలకు దుమికారు. పైయేడు వింబుల్డన్ బహుమతుల డబ్బు 50 వేల పౌనులు దాటేసినట్టే అంటున్నారు. ఈ రకమైన భరోసాలతో వింబుల్డన్ చులాగ్గా రెండు లక్షలకు చేరుతుంది.

ప్రదర్శనాల పద్ధతితో యినాళ్ళుగా యీఆటలతో ముఖం మొత్తిన వారికిదో ఆట విడుపు, ఈ పద్ధతి ఆటల మీద వుత్సాహం వల్ల చిన్నచిన్న పోటీలు మాంచి సరదానూ, ప్రోత్సాహాన్ని పొందుతున్నాయి.

కనుక, తమ చుట్టుపక్కల పరిస్థితి గతులను కొంచెం చూసయినా యీ ప్రొఫెషనల్స్ తమ పంతాలను, పట్టాలను భూస్థాపితం చేయడం తెలివైన పని.

—(ఫో. వ. ఫి.)

# సినిమా

( 62వ పేజ తరువాయి )

చంద్రరావు దర్శకుడు. గొల్లపూడి రచయిత. లక్ష్మి విడుదల.

## రాఖీ వుండదా?

'జీవన్‌మృత్యు' నాయిక రాఖీ త్వరలోనే సినిమారంగం నుండి నిష్క్రమించి, గృహస్థాశ్రమంలోనికి ప్రవేశించబోతూంది. కారణం — కాబోయే భర్త పెట్టిన నిబంధనే.

—శ్రీనివాస్



Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3. Editor : S. Radhakrishna.


వెంకన్న కొలువు
బొమ్మల కథ
9


మీరు దేనికి శంకు స్థాపన చేసినా, ప్రారంభోత్సవం చేసినా అసలు అచ్చి రావడం లేదు గదా- ఈసారి ఆస్పత్రి శంకు స్థాపనకి వెంకట్రువణ్ణి పిలిపించి తుమ్మిద్దాం సార్!
అలాగే కానీ
దిన పత్రిక


అబ్బో! మంత్రిగారి దగ్గర్నుంచి కూడా నీకు ఆహ్వానం వచ్చిందే!


అవునుగాని రాజీ! నేనంటే నీకిష్టమేనా? చెప్పు..... చెప్పవూ!
అబ్బ! ఆశ! నే చెప్ప- ను పో!


ఆస్పత్రి శంకు స్థాపనకి అంతా రెడీ అయింది- వెంకట్రువణ్ణికి తుమ్ము రావడమే ఆలస్యం!


ఏమిటండీ! దాదాపు గంటన్నర గడిచింది- ఇంత వరకూ తుమ్మకపోతే ఎలా!


ఇవాళేమిటో తుమ్మ- సలు రావడం లేదండీ- రోజుకి పాతిక సార్లైనా తుమ్ముతుంటా మామూలుగా
(ఇంకా ఉంది)

